# విమర్శవినోదము

[కతిపయ సంస్కృతాంధ్రకావ్యనాటకాది విషయకము]

---

వేదము వేంకటరాయశాస్త్రి కృతము

ప్రథమ ముద్రణము



చెన్నపురి

ఇండియా ముద్రాక్షరశాలయందు ముద్రితము

1920



[దీనివెల 12 అణాలు

ఈ గ్రంథము వలయువారు :—

వేదము వేంకటరాయశాస్త్రి,

4, మల్లికేశ్వరవీథి, మదరాసు.—

అను విలాసమునకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

# పెద్దలకు విన్నపము

ఈ పుటలలో రసికప్రమోదార్థము కావ్యాదివాఙ్మయంబున టీకాకారసంపాదకప్రభృతుల ప్రమాదములను గొన్నింటిని యథామతి నివేదించితిని. పెద్దలు ఈ నివేదనను భ్రమ యని నిరూపించినను ప్రమ యని నిరూపించినను ధన్యుండనే. ప్రమోదమే ముఖ్యోద్దేశ్య మగుటం బట్టి బుద్ధికి క్లేశ మొసంగని విషయములనే కూర్చినాడను.

ఇవి యీ నడుమ నొకానొక కార్యమునకై కొన్నికబ్బములం జదువుటలో నామదికిం దోంచినవి. వీనిని చిన్నిపొత్తముగా వ్రాసి ముద్రింపం గోరియుండంగా - కావలివాస్తవ్యులు కావలి గ్రామసంఘాధ్యక్షులు తాలూకాబోర్డు సభ్యులు సంస్కృతాంధ్రహూణభాషాభినివిష్టులు తద్భాషాత్రయ వాఙ్మయరసగ్రహణపరాయణులు కళావతీయుగంధరనవలాద్వయకర్తలు మదీయమిత్రతల్లజులు నగు శ్రీయుత దొడ్లా వేంకటరామరెడ్డిగారు అందులకు వలయుధనము నొసంగి అయ్యభీష్టమును నెఱవేర్చినారు. ఈతీరున స్వదేవభాషామాతృభాషలను నిండారు పఠనములచేతను గ్రంథ రచనలచేతను సేవించుటకును అన్యకృతములను ఎంతదొడ్డగానేని పోషించుటకును వారికి పరమేశ్వరుండు అఖండాయు రైశ్వర్యముల నొసంగుం గావుత.

మదరాసు,
ఫిబ్రవరి 1920.

వేదము వేంకటరాయశాస్త్రి.

# విమర్శ వినోదము

## శోధన పత్త్రము

| పుట | పంక్తి | అసాధువు | సాధువు |
|---|---|---|---|
| 3 | 3 | ఆమత్తనాం | అనుత్తానాం |
| | 20 | సఖీఖి | సఖీభి |
| 4 | 12 | సమారమ్బేణ | సమారమ్భేణ |
| 8 | 15 | నురభిః | సురభిః |
| 16 | 3 | సాథన | సాధన |
| | 27 | నితమ్బా | నితమ్బా |
| 19 | 1 | ద్వేధీ | ద్వైధీ |
| 20 | 1 | బోవువని | బోవునని |
| | 12 | ద్యాపార | వ్యాపార |
| 21 | 8 | పఙ్క్తి | పఙ్క్తిఁ |
| 30 | 17 | నిర్మజ్జత్కు | నిర్మజ్జచ్చత్కు |
| 32 | 9 | స్మిల్మ్రనోహార | స్మిలన్మ్రనోహార |
| 35 | 2 | అవక్రమ్ | అవక్ర |
| 36 | 10 | భిన్త | భిస్త |
| 38 | 13 | వాఖ్యలు | వ్యాఖ్యలు |
| 39 | 18 | సాదృశ్యమ్ | సాదృశ్యమ్ |
| 49 | 22 | బహుప్రీహా | బహువ్రీహి |
| 50 | 6 | జజ్వలన | జ్వలన |
| 51 | 18 | బెట్టబడి | బెట్టఁబడిన |
| | 24 | సువర్ణమును | నువర్ణమును |

# విమర్శవినోదము

## విషయసూచిక

### సంస్కృతగ్రంథములు



### ఆంధ్రగ్రంథములు

# విమర్శ వినోదము.

## I. శాకుంతలము



### ౧. వసందోదారసమయమ్మి.

ఛా. అవతార×ఉదార

అవతార మనుటచే ప్రారంభదశ తోఁచును. ఉదారదశ యనుటచే దాని పిమ్మటఁ గొంతకాలమునకు కలుగునట్టి ప్రౌఢదశ తోఁచును. ఉదారత నిట్లు వ్యాఖ్యాతలు వివరించినారు.—

> “ఉదార వసన్త సమయే - ప్రాకృతే పూర్వనిపాతానియమః” అని రాఘవ భట్టవ్యాఖ్య. “వసన్తేన ఉదార సమయః వసన్తకాలః - వసన్తస్య ఉదారత్వం నామ పరిపోషదశా - మలయమారుత పికస్వరాదీనాం శిశిరర్తు ధర్మ సాంకర్యదోష రాహిత్యేన నిరర్గళ ప్రవృత్తిః - తదా తద్ధర్మాణా మమోఘకార్యకారిత్వం భవతీతి భావః.” అని శ్రీనివాస వ్యాఖ్య.

అట్లయినను, మలయమారుతప్రసర కుసుమపల్లవోద్భేద కోకిలకూజిత భృంగఝంకారాది ధర్మ పాదుర్భావ విశిష్టమైనకాలమునే మహాకవులు వసంతావతార మని వ్యవహరించుటచేతను, దానినే అత్యంతమదనోద్దీపకముగాను విరహిజనప్రాణహారకముగాను వర్ణించుటచేతను, ఋతుధర్మముల క్రొవ్వాడి “మగని విడిచిన ముండ, మబ్బు విడిచినయెండ,” అన్నట్లు, మార్పులో స్ఫుటతరముగావునను, ఋతుధర్మములు ఆది మొదలు ఉద్దీపకములేగాని ప్రౌఢదశవచ్చువఱకు నిద్రపోవుచుండవు గావునను, వసంతముయొక్క అభినవదశవలె కడమదశలు అంతగా రమణీయములు గామిచేతను, ప్రాకృతవ్యాకరణముప్రకారము రెండుఛాయలును సాధువులే గావునను, ఉదార మనుఛాయకన్న అవతారమనుఛాయయే శ్రేయ మని మదభిప్రాయము.

i. (1) వసంతావతారస్వరూపమును కాళిదాసు విక్రమోర్వశీయములో నిట్లు వర్ణించినాఁడు.—

విదూ.—పెక్ఖదు భవం వసందోదారసూఅఅం అహిరామత్తణం పమదవణస్స.

రాజా.— నను ప్రతిపాదప మే వావలోకయామి। అత్రహి।

ఆద్యే స్త్రీనఖపాటలం కురవకం శ్యామం ద్వయో ర్భాగయో,
ర్బాలాశోక ముపోఢరాగసుభగం భేదోన్ముఖం తిష్ఠతి,
* ఈషద్బద్ధరజఃకణాగ్రకపిశా చూతే నవా మఞ్జరీ,
ముగ్ధత్వస్య చ యౌవనస్య సఖే మధ్యే మధుశ్రీః స్థితా.

ఇచ్చట 'అవతార' అనియే వ్యాఖ్యాతలు వ్రాసినఛాయ. ఈప్రమాణముచే వసంతావతార మనఁగా పంచాంగోక్త మయిన చైత్రశుద్ధప్రతిపత్తిథియే యని గ్రహింపఁ దగ దనియు మధుశ్రీయొక్క ముగ్ధత్వ యౌవనముల సంధిదశయే అవతార మని వ్యవహరించుట కవికులసంప్రదాయ మనియు స్పష్టము.

అవతారమును వర్ణించుటయే మహాకవిసంప్రదాయ మనుటకు కొన్ని యుదాహరణాంతరములం జూపెద. ముందుగా- ఋతువులని సుఖదుఃఖానుభవభేదములు ఋత్వారంభమందే మిక్కుటము లనుటకు ఈక్రిందిప్రస్తావములం గనుఁడు.—

"అద్యారభ్య యది ప్రియే పునరహం మానస్య వా భాజనం,
గృహ్ణీయాం విపరూపిణ శ్శ్రుతమతే ర్నామాఽపి సంక్షేపతః,
కిం తేనైవ వినా శశాఙ్కకిరణస్పష్టాట్టహాసా నిశా,
నైకో వా దివసః పయోదమలినో యాయా న్మమ ప్రావృషి?" అమరుకము.

[శరద్వర్షారంభము లిందు ప్రస్తుతములు.]

"ఘర్మసమయారమ్భ సమధిక దుస్సహోష్మ ఘర్మాభిధాన రసాతల జ్యేష్ఠే మహప్రాప్తే"-గద్యచింతామణి. 5 (89 పు.)

"నిష్ఫలా జలదసమయారమ్భాడమ్బరాః." కాదంబరి-556 పు.

"వికసిత కాశ కుసుమ మఞ్జరీవ శరదారమ్భమ్"—485 పు.

(2) మాళవికాగ్నిమిత్రము—అం. 3

విదూ.—ణం భవం అజ్జ ఎవ్వ ప్రథమం వసందోదార సూఅఆణి రత్తకురవఆణి ఉవాఅణం పేసిఅ, ణవ వసందూసవావదేసేణ ఇరావదీఏ ణిఉణిఆముహేణ పత్థిదో ఇచ్ఛామి అజ్జఉత్తేణ సహ డోలాహిరోహణం అణుహోదుంతి.

---

* "చూతే" శబ్దమును ఆఱవముగాఁ గొని రసికశిఖామణులు గొందఱు అశ్లీల మని యంగీకరించుచునే ప్రకృతోపయోగి యని యొకయర్థవిశేషమును దీనికిం జెప్పి సంతోషింతురు.

ఆ ప్రకరణములో ఆదినమందే—

రాజా.—(స్పర్శం నిరూప్య) అభిజాతః ఖలు వసన్తః—

ఆవర్తినాం శ్రవణసుభగైః కూజితైః కోకిలానాం
సానుక్రోశం మనసిజరుజ స్సహ్యతాం పృచ్ఛతేవ
ఆద్ధే చూతప్రసవసురభి ర్దక్షిణో మారుతో మే
సాన్ద్రస్పర్శః కరతలఇవ వ్యాపృతో మాధవేన.

వెండియు నాప్రకరణములోనే—

రాజా.—నను విస్మయా దవలోకయామి :

రక్తాశోకలతావిశేషితగుణో బిమ్బాధరాలక్తకః,
ప్రత్యాఖ్యాత విశేషకం కురవకం శ్యామావదాతారుణమ్,
ఆక్రాన్తా తిలకక్రియాపి తిలకై ర్లగ్నద్విరేఫాఞ్జనైః,
సావజ్ఞేవ ముఖప్రసాధనవిధౌ శ్రీ ర్మాధవీ యోషితామ్.

(3) శాకుంతలమందే అం. 6.—కహం ఉవట్టిదో మహుమాసో !

(4) విద్ధసాలభఞ్జిక-ప్రథమాంకము.—

(నేపథ్యే) సుఖాయ వసన్తావతారో భవతు దేవస్య ;

గర్భగ్రన్థిషు వీరుధాం సుమనసో, మధ్యేఽఙ్కురం పల్లవాః,
వాఞ్ఛామాత్ర పరిగ్రహాః పికవధూకణ్ఠోదరే పఞ్చమః,
కించ త్రీణి జగన్తి జిష్ణు దివసై ర్ద్విత్రై ర్మనోజన్మనో
దేవ స్యాపి చిరోజ్ఝితం యది భవే దభ్యాసవశ్యం ధనుః.
సపది సఖీభి ర్నిభృతం । విరహవతీ స్త్రాసు మద్య భఙ్క్త్వా
సహకార మఞ్జరీణాం । శిఖోద్గతగ్రన్థయః ప్రథమే.

రాజా.—అయే సురభిసమయారమ్భః ! సైవేయం మన్మథసైన్యసామగ్రీ !

విదూ.—(ఛా.) వన్దివచన శ్రూయమాణశిశుభావ ఉపవన దృశ్యమాన స్తోకవిస్తారః సురభిసమయారమ్భ ఇతి కిన్విద మనవరత సారణీసేక సుకుమారాసు కేళి వనవసున్ధరాసు అధికవిస్తారీ సురభిసమయారమ్భః.

రాజా.—తతశ్చ.

సామ్యం సంప్రతి సేవతే విచకిలం పాణ్డోషికై ర్మౌక్తికై,
ర్మాఞ్జిష్ఠాకీదళనచ్ఛటారుణతరై ః పత్రై రశోక శ్చితః,

భృఙ్గాలక్షితకోటి కింశుక మిదం కించి ద్వివృన్తాయ తే,
మాకన్దస్తబకై శ్చ పాటలితరో ర న్యైవ కాచి ల్లిపిః.

(౫) పంచబాణవిజయమున—సూత్ర.—(సమన్తా దవలోక్య సోల్లాసమ్)

పరభృతకలపాటీ త్రోటికోటీకవాటీ
పుటవిఘటనకేళీకల్పనాకుఞ్చికాఽసౌ,
నవకలమధూళీపాన మత్తాళి పాళీ
రవముఖరదిగన్తః ప్రాదురాసీ ద్వసన్తః.

కించ.—యస్మిన్ మదనగజయన్తా । మల్లీమహిళా ర్తవోత్సవముహూర్తః
సుధురపధునా ప్రామరధూ । న్మాన్యవతీమాన ఘానన ధురీణః.

(౬) కర్పూరమంజరి-ప్రథమ జవనికాంతరము—

రాజా—దేవి, కాశ్మీరపకులప్రదీప నన్దనే, అస్య ద్విలోచ నానన్దనే, వికసిత వివిధ కుసుమ ప్రకర పరిమళసురభేః సురభేః సమారమ్భేణ వర్ధాప్యసే.

ఏతే తే మలయాచలాఉ పవణా వాఅంతి సేయావహా
విల్లంతి ద్దుమపల్లవా ణవణవా కందప్పభల్లీనిహా
గుంజంతా మహురం భమంతి భమరా రుక్ఖాఉ రుక్ఖాంతరం
సంపత్తా సురహీ మహీవరవహూ సోహగ్గవిత్థారగా;

(నేపథ్యే) వైతాళికయో రేకః—శా. జయ జయతచన్ద్రి రాజరాజ. సుఖాయ భవతు దేవస్య సురభి సమయారమ్భః. యతః—

శా. త ద్వ్యక్తం విధినాఽతను ర్విరచితో యత్కామవీరోఽన్యథా
ఆకర్ణం పతను స్స పూరయిత్వా శరా న్మక్షేప్త ద్యది
మూర్ఛేయ్తే సకలమపి తావ త్త్రిభువన మున్మ త్తదేవాసురం,
ఏకం తావ న్నాదం తతోఽపి మిళితం తైలేన కిం వర్ణయామః!

(౭) ప్రసన్నరాఘవములో అం. 2.—

లక్ష్మణః.—ఆర్య, నిసర్గరమణీయోఽయ మారామః, అధునా తు మధుమా సావతారేణ నితాన్త రమణీయః.

రామః.—(సహర్షమ్) కథ మవతీ ర్ణైవ వసన్తమాస లక్ష్మీః! (విమృశ్య) ఏవ మేతత్.

ఈవెంబడి మల్లీ మధుకర వంజుళ దక్షిణానిల కుసుమనికర విజృంభితము వర్ణితము.

(8) కర్ణసుందరి అం—1.—

(నేపథ్యే) సుఖాయ కుసుమసమయారమ్భో దేవస్య. సంప్రతి హి:—

రక్తాశోకద్రుమాణాం లసతి కిసలయశ్రేణి రార్ద్రాపరాధ
ప్రేయః శౌణ్డీర్య పీత ద్రవిడవరవధూచారుబిమ్బాధరశ్రీః,
ఉన్మ్రేష శ్చమ్పకానా మజరఠమరఠీగణ్డపాళీవిలాసః,
కర్ణాటీహాస్యలేశా న్విచకిలముకుళస్ఫూర్తయో వార్తయన్తి.
కాన్తే నూతనచూతమఞ్జరధనుర్దణ్డే౽ధునా సందధ
త్యన్దర్పః కలకణ్ఠపఞ్చమరవబ్రహ్మాస్త్ర మవ్యాహతమ్
దోర్యుగ్మం వలయీకరోతి యుగప త్కర్తుం త్రిలోకోపరి
స్వామ్యాజ్ఞాం రతివక్త్రపత్త్రిళబలం మార్వీకిణాఙ్కాఙ్కితమ్.

[ఈ కాల మత్యంతమదనోద్దీపకముగా నున్న దని ఉత్తరార్ధమునకు భా.]

విదూ.—(అన్యతః)

కావేరీ ణాళిఏరీ తరళన నిఉణా, ణమ్మదాణమ్మఆరా,
కంచీఏ చుంబణద్ధా, తుముళిద మురళా లోల కల్లోలమాలా,
ఏదే గోదావరీఏ లహరిపరిచిదా, దిణ్ణసిప్పాకదప్పా,
కందప్పోద్దీవణేచ్ఛాగహిదవిహరణా దాహిణా ఏంతి వాఆ.

(9) ముకుందానందభాణమున—

నటీ.—ఆర్య, ఏత చ్చూతవనం కథయతి వసన్తాగమనమ్.

(10) కర్పూరమంజరిలో (వైతాళికుఁడు రాజుంగూర్చి)

సుఖాయ తే భవతు సురభిసమయారమ్భః।

(11) జకన్నవిక్రమార్కచరిత్రలో—

సీ. రాజకీరకుమారరాజి కక్కురశిక్ష యొనరింప వచ్చినయొజ్జ యనఁగ,
కలకంఠనికురుంబకములకు వాకట్టు విడిపింప వచ్చినవెజ్జ నంగ,
తరులతాదులకు వార్ధకము మానఁగ మందుసేయంగ వచ్చినసిద్ధుఁ డనఁగ,
సంప్రణయక్రోధజంపతినివహంబుఁ గలుపవచ్చిన చెలికాఁ డనంగ,
తే. మందమారుతోద్ధూతమరందబిందు
సిక్తషట్పదఝ్యారవశ్రీవిలాస

మకరకేతుప్రతాపసమగ్రమై వ
సంత మేతెంచె సంతతోత్సవ మెలర్ప. ౫ (3)

ఈపద్యమున కనంతరము కొంతకథయైనపిమ్మట మధుమాసపూర్ణిమ యాసన్నమైన దని వర్ణితము.

(12) నన్నెచోడకుమారసంభవమున—

"ఇట్లసమశరుండు సమరసన్నద్ధుం డై సకలజనంబులు నభినవవసంతోత్సవంబున ననురాగరసపూరితహృదయులై పరవశు లై యున్నం గని"

(13) వరాహపురాణమున—

"వసంతసమయసమారంభణంబులు విజృంభించిన." 3 (69)

(14) వసంతతిలకభాణములో—(పరిక్రమ్య దిశోఽవలోక్య సాశ్చర్యమ్)

మధుకరపరిభుక్త మాధవీనాం । మలయసమీర విలోలమఞ్జరీణామ్
కథయతి మధుమాసవాసరాణా । ముపగత మున్మదకోకిలా వనశ్రీః.

అపిచ.—మన్దానిలేన మధురం పరినర్తితాయాః
పర్యాయతః ప్రచలదఙ్గులిపల్లవాయాః
మఞ్జుస్వనై ర్మధుకరై రుపగీయమానం
నాట్యం మనోహర మిదం నవమల్లికాయాః.

(సౌరభాఘ్రాణ మభినీయ, సవితర్కమ్) అధునా నిఖిలకుసుమహేతునా వసన్తేన భవితవ్యమ్ (సమన్తా దవలోక్య)

ఉద్వేలపఙ్క్తిమ ముదఞ్చితబాలచూత
ముద్దామకేసర ముదారసమీరపోతమ్
ఉన్నిద్రపఙ్క్తికేర ముల్బణకర్ణికార
ముచ్చై రిదం హి మధువాసర మావిరాసీత్.

(15) కాదంబరి-పూ. 484—పరిమళగ్రాహిణీ మలయానిలాగతిరివ వసన్తమాసావతారమ్...అవస్థైవేయం మావేదయతి...దేవస్య గమనమ్.

(16) కాదంబరి-పూ. 555—వృథా వసన్తమాసాభ్యాగమః.

(17) కవికల్పలత 102 (32)—కించ కించన వచన ముచ్యమాన మధునా మధునా సమానమ్ । అధునా మధునోఽవతారః క్షణ మవ ధ్యేవతు.

(18) సత్యహరిశ్చంద్రనాటకములో అం. 1.—

కపిస్తలః—వసన్తావతారవ్యతిషజ్యరజ్యత్పరభాగస్య జగతః శ్రియ మవధారయతు దేవః,

పరభృతవధూగీతస్ఫీతశ్రియో వనశాఖినః,
ప్రతిదిశవిశన్మల్లీవల్లీరజస్తరళం నభః,
కకుభి కకుభి స్మేరాక్షీణాం విసర్పతి చర్చరీ,
ప్రతితరుతలం క్రీడాశ్రాన్తా లసన్తి విలాసినః.

(19) శృంగారభూషణభాణములో—సూత్రధారః—కించ...
కాలః కోకిలకణ్ఠరాగ విలస త్కన్దర్ప దర్పోదయః.

పారిపార్శ్వకః—సమ్యగుపక్షిప్తం వసన్తాగమ ఇతి. తథాహి—

కుట్మలితచూత విటపాః । కోమలకలకణ్ఠపఞ్చమప్రసరాః
పక్ష్మలితమదనశౌర్యా । మదయన్తి మనాంసి మాధవారమ్భాః.

సూత్ర—(సర్వతోఽవలోక్య) అయే మధుసమయారమ్భ గుమ్భితామోద ముత్సవ
మయ మివజగ దఖిల మాలక్ష్యతే. తథాహి—

చూతాః పఞ్చశరస్య బాణరచనా ప్రస్తావ మాతన్వతే,
సల్లాపా న్పరిచిన్వతే పరభృతాః ప్రాదుర్భవత్పఞ్చమాః,
ఆదత్తే పవనోఽపి సౌరభమయీ మన్యాదృశీం వాసనాం,
పుష్పోద్భేదవతీ మశోకలతికా మభ్యేతి పుష్పన్ధయః.

కింబ్రవీషి ? అభినవవసన్తావతారరమణీయస్య పశ్యామి సౌభాగ్య ముపవనస్యేతి ?

(20) కుసుమజన్మ తతో నవపల్లవా తదను షట్పద కోకిల కూజితమ్
ఇతి యథాక్రమ మావిరభూ న్మధు ర్ద్రుమవతీ రవతీర్య వనస్థలీః. రఘు 9 (1)

(21) పుష్పాణి ప్రథమం; తతః ప్రకటితాః స్వాన్తోత్సవాః పల్లవాః,
పశ్చా దున్మదకోకిలాళిలలనాకోలాహలః కోమలః;
ఇత్థం ప్రాదురభూ దుపేత్య పరితః ప్రాజ్యప్రమోదప్రదః
ప్రోద్దామద్రుమరాజిరాజితవనక్షోణీ మృతుక్ష్మాపతిః. సు. ర. భా. 542 (96)

ii. అవతారవర్ణనా సంప్రదాయముకొఱకు ఈప్రదర్శించిన యుదాహరణ ములయందే అవతార ముద్దీపక మనియుం గలదు గదా. అవతార ముద్దీపక తమమును విరహి ప్రాణహారమును అనుటకు మఱికొన్ని యుదాహరణంబులం బ్రదర్శించెద.—

(1) కుసుమ మేవ న కేవల మార్తవం నవ మశోకతరోః స్మరదీపనమ్,
కిసలయప్రసవోఽపి విలాసినాం మదయితా దయితాశ్రవణార్పితః. రఘు 9(28)

(2) వికసితసహకార భారహారి పరిమళపుఞ్జితగుఞ్జితద్విరేఫః
నవకిసలయచారుచామరశ్రీ ర్హరతి మునే రపి మానసం వసన్తః.—
(సు. ర. భా. 537 (3)

(3) సుభగే కోటిసంఖ్యత్వ ముపేత్య మదనాశుగైః
వసన్తే పఞ్చతా త్యక్తా పఞ్చతాసీ ద్వియోగినామ్. 537 (7)

“మదనాశుగైః”— పువ్వులచే ననుట. అందువలన ముదురని దశయే సూచితము.

(4) వికసతి సహకారే స్ఫారసౌరభ్యసారే
వహతి మలయపటీరే మన్దమన్దం సమీరే
కలయతి కలవాచం కోకిలే కోఽపి రుష్టః
క్షణమపి న మృగాక్ష్యా వల్లభో వల్లభోఽభూత్. 541 (87)

(5) మన్దోఽయం మలయానిలః, కిసలయం చూతద్రుమాణాం నవం,
మాద్యత్కోకిలకూజితం, విచకిలామోదః, పురాణం మధు,
బాణా నిత్యుపదీకరోతి సురభిః పఞ్చైవ పఞ్చేషవే
యూనా మిన్ద్రియపఞ్చకస్య యుగప త్సమ్మోహసంపాదినః. 542 (92)

(6) వసన్తప్రారమ్భే చిరవిరహఖిన్నా సహచరీ
యది ప్రాణా న్ముఞ్చే త్తదిహ విధగామీ భవతి కః?
వయో వా స్నేహో వా కుసుమవిశిఖో వేతి విమృశ
న్తు హీతి ప్రవ్యక్తం పికనికరఝుఙ్కార మశృణోత్. 544 (140)

(7) ఆల మ్బ్యాఙ్గణవాపికాపరిసరే చూతద్రుమే మఞ్జరీం
సర్పత్సాన్ద్రపరాగలమ్పటరణద్భృఙ్గాఙ్గనాశోభినీమ్
మన్దం స్వాం తను ముత్తరీయశకలే నాచ్ఛాద్య బాలాస్ఫుర
త్కణ్ఠధ్వాననిరోధకమ్పితకుచశ్వాసోద్గమా రోదితి. అమరు 98.

టీక.— ప్రోషితో నాయకః వసన్తసమాగమే ప్రియాయాః అవస్థాన్తరం వితర్కయ న్నాహ.— కాయ ఉద్దీపకము గాదు, ముదురాకు గాదు, మంజరియే యగును. కావున అవతారమే మారకము.

(8) సరస్వతీకణ్ఠాభరణములో—

"యాన్త్యా ముహు ర్వలితకన్ధర మాననం త
దావృత్తవృన్తశతపత్త్రనిభం వహన్త్యా
దిగ్ధోఽమృతేన చ విషేణ చ పక్ష్మలాక్ష్యా
గాఢం నిఖాత ఇవ మే హృదయే కటాక్షః."

అత్ర మాలత్యా మాధవవిషయే పూర్వ ముత్పన్నా రతి ర్వసన్తావతార తత్సన్నిధి విశేష ప్రదర్శనాదిభి రుద్దీప్యమానః—

(9) సీ. కలకంఠసుందరీకలకలధ్వనులతో । బెడఁగుగా వెలి పీడు విడిచె మరుఁడు,
మరుధనుర్జ్యావల్లి మొరపంబుగతి లతా । మంటపంబుల నిండె మధుపరవము,
మధుపరవోల్లసన్మంజరీమకరంద । సురభిగంధంబులు నెరసె దిశల,
దిశ లెల్లఁ దాన యై తిరిగెఁ జాంధశ్రేణి । కంపింప దక్షిణ గంధవహుఁడు,

తే. వనము లెల్లను గ్రొత్త జవ్వనముఁ దాల్చె,
దళితహేమంతగర్వ మై వెలసె నెండ,
నతులహిందోళగానంబు లతిశయిల్లె,
రాగకరమైన నవవసంతాగమమున. ప్రబంధరత్నావళి—543

మధుసమయము నవత్వమందు మనోహరముగాని అనంతరము అంతగా మనోహరముగా దనుటకుం బ్రమాణము:—

అపి చైత్యవనగా నవతానవతా । నవతా నబతా స్తతరా మధునా
ఇహ సౌఖ్య మగోచర మాచర మా । చరమా చ రమాఽస్య న రమ్యతరా.

నలోదయము 2 (27)

ఈ ప్రమాణముంబట్టి—

"అతిదూర ప్రవృద్ధేన మధునా జగతి కో వా న విక్రియతే." వాసవదత్త.

"ఉడుపతిశారికి న్వెఱచి యూఱట యా నని పేరటామనిం
ముడివడుకంతుసేనలకు మువ్వెలగు ట్టయినట్టి యిందు రా
నడఁగునె తాపవహ్ని ? మన మై హరిణేక్షణ, ముల్లు వుచ్చి కొ
ఱ్ఱడిచినచంద మాయెఁ బదమా యెలదోఁటఁ జరింప కింటికిన్." మను.

అను నిత్యాదిస్థలములందు ప్రవృద్ధమధువు-పేరటామని-ఇత్యాదిప్రయోగములకు మెందుకొని విజృంభిత మయిన వసంతావతారమే యర్థముగా గ్రహించుట న్యాయ్యమని తోఁచుచున్నది.

## ౨. అకామాపిహి.

యతో యతః షట్చరణోఽభివర్తతే
తత స్తతః ప్రేరితలోలలోచనా
వివర్తితభ్రూ రియ మద్య శిక్షతే
భయా దకామాఽపిహి దృష్టివిభ్రమమ్. అం. 1

ఈశ్లోకమును ప్రక్షిప్తముగా భావించి శాకుంతలవ్యాఖ్యాతలు దీనికి వ్యాఖ్య వ్రాయరైరి. కొందఱు దీనిని అంకములో ముద్రించుటయే మానిరి. వారిచిత్తమున కిది కడు నిష్ప్రయోజనముగా తోఁచినది.

ఇది మిక్కిలి సారవంత మయినశ్లోకము. "అకామాపిహి" అనునుడి దీనియందు దప్పృతిప్రజున్న. ఈనుడిని నిస్సారతరముగా ఒకరు "అనిచ్ఛా" అనియు, ఇంకొకరు "ఇచ్ఛలేనిదె" అనియు ఆంధ్రీకరించినారు. అయినను ఇదియే యీగ్రంథమున నాయకమనస్సంగబీజపదము. దీనికి "కామప్రేరణ లేనిద యయ్యు"-"కందవ్వఁడు నేరుపకయె" అని యర్థము. తుమ్మెద పైకొనుటచేఁ గలిగినయాశకుంతలబెదరుఁజూపులు దుష్యంతునికి కామప్రేరితదృగ్విభ్రమములయంత మనోహరములై మనస్సంగముం గలిగించినవని కవిహృదయము.

ఈమనస్సంగమునకై కవికులగురువు ఒక్కొక్కనాటకమం దొక్కొక్క సంవిధానమును కల్పించుకొన్నాఁడు.

మాళవికాగ్నిమిత్రమందు నాయకునిమ్రోల నాయిక విరళనేపథ్యముతో నృత్యమాడుట, అతని నుద్దేశించినట్లుగానే కృతిం బాడుట, ఇత్యాది సంవిధానము మనస్సంగార్థము.

విక్రమోర్వశీయమున నాయకుఁడు నాయికను చెఱవిడిపించుట, తనరథమం దిడుకొనుట, వక్షమునం దెత్తుకొనుట, వ్యాజమున స్తనములను తనివార దర్శించుట – ఇత్యాది సంవిధానము కల్పింపఁబడినది.

తుమ్మెదను కాళిదాసు ప్రియదర్శికనుండి సంపాదించుకొనియుండును. అది మునికన్యయగు శకుంతలకు గీతనాట్యాదులకన్న ఉచితతర మని దాని నిందుం బ్రయోగించినాఁడు.

రాజశేఖరుఁడు భవభూతియొక్క "జలనిబిడితవస్త్ర వ్యక్త నిమ్నోన్నతా" స్వారస్యము నెఱింగినవాఁడై కర్పూరమంజరిలోను విద్ధసాలభంజికలోను నాయకు

నికి నాయికలను జలనిబిడితవస్త్ర వ్యక్త నిమ్నోన్నతలనుగా ప్రథమదర్శనంబునఁ జూపినాఁడు.

ఇందులకు ఇంచుక వివరివి.

(1) మాళవికలోని సంవిధానప్రపంచము.

తొట్టతొలి నాయకుఁడు నాయికను చిత్తరువులోఁ గాంచుట. అందుచేత చక్షుః ప్రీతి జనింపఁగా, నాయకప్రార్థనచే ఒకపన్నాగము పన్ని విదూషకుఁడు నాయకునిమ్రోల నాయిక నాట్యమాడునట్లు కావించుట. అందువలన మనస్సంగము కలుగుట.

పరివ్రాజికా.—నిర్ణయాధికారే బ్రవీమి సర్వాఙ్గ సౌష్ఠవాభివ్యక్తయే విరళనేపథ్యయోః పాత్రయోః ప్రవేశోఽస్తు.

విదూషకః—(స్వా.) భో ఉపస్థితం నయనమధు, సన్నిహితమక్షికం చ; తస్మాదప్రమత్త ఇదానీం పశ్య.

రాజా.—(జనాన్తికమ్) వయస్య,

చిత్రగతాయా మస్యాం । కాన్తివిసంవాదశఙ్కి మే హృదయమ్;
సంప్రతి శిథిలసమాధిం । మన్యే యే నేయ మాలిఖితా. అం. 2

రాజా.—(ఆత్మగతమ్) అహో సర్వావస్థా స్వనవద్యతా రూపస్య!
దీర్ఘాక్షం శరదిన్దుకాన్తి వదనం, బాహూ నతా వంసయోః,
సంక్షిప్తం నిబిడోన్నత స్తన మురః, పార్శ్వే ప్రమృష్టే ఇవ,
మధ్యః పాణిమితో, నితమ్బి జఘనం, పాదా వరాళాఙ్గులీ,
ఛన్దో నర్తయితు ర్యథైవ మనసి, శ్లిష్టం తథాఽస్యా వపుః.

గీతవ్యాజమున నాయిక తన్ను నాయకుని కర్పించుకొనును.

స్వా. దుర్లభః ప్రియః, స్తస్మిన్ భవ హృదయ నిరాశమ్;
అహో! అపాఙ్గకో మే స్ఫురతి కిమపి వామకః!
ఏష స చిరదృష్టః కథం పున ర్ద్రష్టవ్యః?
నాథ, మాం పరాధీనాం త్వయి గణయ సతృష్ణామ్.

దీనిని నాయకుఁడు గ్రహించినాఁడు.

రాజా.—(జనాన్తికమ్)........అనయా ఖలు.
జన మిమ మనురక్తం విద్ధి నాథేతి గేయే
వచన మభినయన్త్యా స్వాఙ్గనిర్దేశపూర్వమ్

ప్రణయగతి మదృష్ట్వా ధారిణీ సన్నికర్షా
దహమివ సుకుమార ప్రార్థనా వ్యాజ ముక్తః.

నాయకుఁడు నృత్తానంతరావస్థితిసౌభాగ్యముం గాంచి మోహపడుచున్నాఁడు.

రాజా.—(ఆత్మగతమ్) అహో సర్వా స్వవస్థాసు చారుతా శోభాం పుష్యతి, తథా హి.—

వామం సన్ధిస్తిమితవలయం న్యస్య హస్తం నితమ్బే,
కృత్వా శ్యామావిటపసదృశం స్రస్తముక్తం ద్వితీయం
పాదాఙ్గుష్ఠాలులితకుసుమే కుట్టిమే పాతితాక్షం
నృత్తా దస్యాః స్థిత మతితరాం కాన్త మృజ్వాయతార్ధమ్.

[సర్వే ప్రహసితాః, మాళవికాచ స్మితం కరోతి.

రాజా.—(ఆత్మగతమ్) ఆత్తసార శ్చక్షుషా స్వవిషయః; య దనేన—

స్మయమాన మాయతాక్ష్యాః । కిఞ్చిదభివ్యక్త దశనశోభి ముఖమ్
అసమగ్రలక్ష్య కేసర । ముచ్ఛ్వసదివ పఙ్కజం దృష్టమ్. 2 (10)

నాట్యాంతమున మాళవిక తెరలోనికి నిష్క్రమించినంతట నాయకుఁడు తద దర్శనముచే వందురుట:—

రాజా.—(జనాన్తికమ్)...అద్యహి.—

భాగ్యాస్తమయ మి వాక్ష్ణో । ర్హృదయస్య మహోత్సవావసాన మివ,
ద్వారపిధాన మివ ధృతేః । మన్యే తస్యా స్తిరస్కరిణీమ్. 2 (12)

అవ్యాజసున్దరీం తాం । విజ్ఞానేన లలితేన యోజయతా
పరికల్పితో విధాత్రా । బాణః కామస్య విషదిగ్ధః. 2 (13)

సఖే, కథం నాతురో భవిష్యామి? యథా—

సర్వాన్తః పురవనితా । వ్యాపారం ప్రతి నివృత్తహృదయస్య
సా వామలోచనా మే । స్నేహ స్యైకాయనీభూతా. 2 (14)

అగ్నిమిత్రునికి ఇప్పటికి మాళవికయందు మనస్సు సమగ్రముగా నాటుకొన్నది.

(2) విక్రమోర్వశీయమందలి మనస్సంగ సంవిధాన ప్రపంచము.—

ఆదిలో నాయకునిమ్రోల మేనక ఊర్వశీసౌందర్యమును స్తుతించును.

మేనకా.—ఛా. శృణోతు మహారాజః. యా తపోవిశేషపరిశఙ్కితస్య సుకుమారం ప్రహరణం మహేన్ద్రస్య, ప్రత్యాదేశో రూపగర్వితాయాః శ్రియః, అలంకారః స్వర్గస్య, సా నః ప్రియసఖీ ఊర్వశీ.......

పిమ్మట నాయకుఁడు చెఱవిడిపించి మూర్ఛితను నాయికను తన పేరురమునం దెత్తుకొని తనయరదంబున నిడికొని తెచ్చును. కన్ను దెఱవు మనును.

రాజా.—సున్దరి, సమాశ్వసిహి సమాశ్వసిహి ;

గతం భయం భీరు, సురారిసంభవం । త్రిలోకరక్షీ మహిమా హి వజ్రిణః
త దేత దున్మీలయ చక్షు రాయతం । మహోత్పలం ప్రత్యుష సీవ పద్మినీ.

నాయిక గుండెలయందలి భయకంపముం బరికించు నెపఁబున నాయకుఁడు స్తనయుగమును చక్కఁగా దర్శించును.

రాజా.—బలవ దత్రభవతీ పరిత్రస్తా; తథాహి—

ముఞ్చతి న తావ దస్యాః । కమ్పం కుసుమసమబన్ధనం హృదయమ్
పశ్య హరిచన్దనేన । స్తనమధ్యోచ్ఛ్వాసినా కథితమ్.

నాయకుఁడు నాయిక మూర్ఛఁదేరుక్రమమును తిలకించును.

రాజా.—అయి ప్రకృతి మాపద్యతే తే సఖీ; పశ్య,—

ఆవిర్భూతే శశిని తమసా రిచ్యమానేవ రాత్రి
ర్నైశ స్యార్చి ర్హుతభుజ ఇవ చ్ఛిన్నభూయిష్ఠధూమా
మోహేనా న్త ర్వరతను రియం లక్ష్యతే ముక్తకల్పా
గఙ్గా రోధఃపతనకలుషా గృహ్ణతీవ ప్రసాదమ్.

నాయకుఁడు ప్రకృతిగతను ఊర్వశిని నిర్వర్ణించును, వర్ణించును.

రాజా.—(ప్రకృతిస్థామూర్వశీం నిర్వర్ణ్య స్వగతమ్) స్థానే ఖలు నారాయణ మృషిం లోభయ న్త్య స్తదూరుసంభవా మిమాం దృష్ట్వా వ్రీడితాః స ర్వా అప్సరస ఇతి. అథవా నేయం తపస్వినః సృష్టి ర్భవితు మర్హతి. తథాహి—

అస్యా స్సర్గవిధౌ ప్రజాపతి రభూ చ్చన్ద్రో౽ను కా న్తప్రభః
శృఙ్గారైకరసః స్వయం ను మదనో మాసో ను పుష్పాకరః
వేదాభ్యాస జడః కథన్ను విషయవ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః. 1 (8)

అనంతరము రథమునుండి దిగఁబోవునప్పుడు అంగస్పర్శము.

రాజా.—(చక్రోద్ఘాతం రూపయిత్వా ఆత్మగతమ్) హన్త! దత్తఫలో మే విషమావతారః!

య దయం రథసంక్షోభా । దంసేనాంసో మృగేక్షణాయాః మే
స్పృష్టః స్సరోమవిక్రియ । మఙ్కురితం మనసిజేనేవ. 1 (11)

ఊర్వశి రాజును సవ్యాజముగా మరలి మరలి కాంచుచు నిర్గమించును. ఆతీరున రాజు చూచుచు వీక్షించును.

[సర్వా స్సగన్ధర్వా ఆకాశోత్పతనం రూపయన్తి.

ఊర్వశీ.—(ఉత్పతనభఙ్గం రూపయిత్వా) హా. అహో! లతావిటపే మమైకావలీ లగ్నా! (పరివృత్య) చిత్రలేఖే, మోచయ తావదేనామ్.

చిత్ర.—(సస్మితమ్) హా. దృఢం ఖలు లగ్నా; దుర్మోచైవ మమ ప్రతిభాతి; భవతు; మోచయిష్యే తావత్.

ఈఘట్టము శాకుంతలములోని "దర్భాఙ్కురేణ" ఘట్టమువంటిది. ఇట అచ్చర గావున ఏకావళి, అచట మునికన్నె గావున వల్కలము, అని విశేషము.

ఊర్వశీ.—స్మర తావ దేత ద్వాక్యమో వచనమ్.

[చిత్రరేఖా మోచనం నాటయతి.

రాజా.—(స్వగతమ్)

ప్రియ మాచరితం లతే త్వయా మే
గమనేఽస్యాః క్షణవిఘ్న మాచరన్త్యా,
యదియం పునరప్యపాఙ్గనేత్రా
పరివృత్తార్ధ ముఖీ మయా హి దృష్టా. 1 (16)

ఈక్రందివాక్యములో మనస్సంగము లోతుగా వేరు దన్నినది.

రాజా.—(ఊర్వశీమార్గోన్ముఖః) అహో నుఖలు! దుర్లభాభినివేశీ మదనః!

ఏషా మనో మే ప్రసభం శరీరాత్ పితుః పదం మధ్యమ ముత్పతన్తీ
సురాఙ్గనా కర్షతి ఖణ్డితాగ్రాత్ సూత్రం మృణాలా దివ రాజహంసీ.

ఇట నాయిక స్వర్వేశ్యయయినందున, తదనుగుణముగా నాయకునితో ఇతరనాయికావృత్తికిలక్షణముగా ఏకవిమానమందుఁ బోవుట, ఒకరిపైనొకరు పడుట, అంగసౌష్ఠవ సామగ్రీ పరిదర్శనము ఇత్యాది సంవిధానమును మనస్సంగార్థము కవివరుల గురువు నిబంధించినాఁడు.

(౩) మహాకవి <u>ప్రియదర్శికయందు</u> పిల్ల రాచదియ యైనను నృత్య గీతములందు నేర్పరియై యయినను, పిమ్మట ఆమెతో నాయకుఁడు నాట్యమాడి కరగ్రహణ సౌఖ్యముం బొందవలసియున్నందునను, గీత సౌష్ఠవమును కూడ అప్పుడే గ్రహించును గావునను, ముందుగా అట్టి విధములం గాక దర్శన స్పర్శనములను మాత్రమే సమగ్రముగానే యొసంగునట్టి తుమ్మెదపిండుం గల్పించినాఁడు.

నాయిక (ప్రియదర్శిక) దేవికై పూజకై తామరలం గోయుచు, తుమ్మెదలపిండులోఁ దగుల్కొని, కనులుమూసికొని, సాయముకై చెలిం జీరుచున్నది. ఆయవసరమున.—

రాజా.—స్వల్పమే వైతత్, పశ్య.

అచ్ఛిన్నా మృతవృష్టిపాతసదృశీం ప్రీతిం దదత్యా దృశాం
యాతాయా విగళత్పయోధరవశా ద్దృష్టవ్యతాం కామపి
అస్యా శ్చన్ద్రమస స్తనోరివ కరస్పర్శాస్పదత్వం గతాః
నైతే య న్ముకుళీభవన్తి సహసా పద్మా స్త దే వాద్భుతమ్. అం. 2.

ఇచట చేటిగా తానే పోయి రాజు నాయికను తోడ్కొను.



రాజా.—(స్వోత్తరీయేణ భ్రమరా న్నివారయన్)

అయి విసృజ విషాదం, భీరు, భృఙ్గా స్త వైతే
పరిమళరసలుబ్ధా వక్త్రపద్మే పతన్తి;
వికిరసి యది భూయ స్త్రాసలోలాయతాక్షీ
కువలయవనలక్ష్మీం, త త్కృత స్త్వాం త్యజన్తి.

ఆరణ్యికా.—(రాజాన మవలోక్య సస్పృహం, సలజ్జం చ ఆత్మగతమ్) హా. అయం స మహారాజః। యస్యాహం తాతేన దత్తా । స్థానే ఖలు తాతస్య పక్షపాతః.

ఆరణ్యిక నిష్క్రమించినంతట వత్సరాజు విరహముచేత కుందును:—

హృత్వా పద్మవనద్యుతిం ప్రియతమే వేయం దినశ్రీ ర్గతా,
రాగోఽస్మిన్ మమ చేత సీవ సవితు బిమ్బేఽధికం లక్ష్యతే,
చక్రాహ్వోఽహ మివ స్థిత స్సహచరీం ధ్యాయ న్నళినా్యస్తటే,
సంజాతా స్సహసా మ మేవ భువన స్యా ప్యన్ధకారా దిశః. అం. 2

ఇచ్చట రాచకన్నియను ఆరణ్యికను రాజు తాఁకవచ్చును గావున అందుకై ఆమె కన్నులు మూసికొనవలసి వచ్చినది. అందుకై ఒక్కతుమ్మెద చాలక తుమ్మెదపిండు తేఁబడినది.

దుష్యంతుఁడు "శంకించితి దేనిం దహనకీలయని తాఁకం దగురవణ మది రత్న కందళిక సుమా" అని పిమ్మట నెఱింగినను మునికన్యను తాఁక నోడును గావున, అందు నాయిక కనుమూయవలసినది లేదు. కనుక నచటిసంవిధానమునకు ఒక తుమ్మెదయే చాలును.— అని విశేషము.

(4) మాలతీమాధవమందు భవభూతి.—

జలనిబిడిత వస్త్ర వ్యక్త నిమ్నోన్నతాభిః
పరిగత తట భూమిః స్నానమాత్రోత్థితాభిః
రుచిరకనకకుమ్భ శ్రీముదాభోగతుఙ్గ
స్తన వినిహితహ స్తస్వస్తికాభి ర్వధూభిః

అని జలనిబిడితవస్త్ర వ్యక్త నిమ్నోన్నత లగుస్నానమాత్రోత్థ యువతుల సౌభాగ్యము నించుకంత రుచిచూపినమాత్రాన, రాజశేఖరుఁడు ఆసౌభాగ్యము నే, మనస్సంగ సాధనముగా, రెండురూపకములందు నలవరించుకొన్నాఁడు.

(5) విద్ధసాలభంజిక.—

విదూషకః.—ఛా. సుష్ఠు ఖలు త్వం మహిళాలమ్పటః। యతో యా సా త్వయా నర్మదాజలోత్తీర్ణా దృష్టా కువలయమాలా నామ.—అం. 1.

మేఖలా.—ఛా. తత్ శృణోతు ప్రియసఖి। అ స్త్యత్ర కున్తలేశ శ్చణ్డమహాసేనో నామ రాజా। తస్య నిజరాజ్యభ్రష్టస్య ఇ హాగతస్య సుతా కువలయమాలా నామ। సా నర్మదామజ్జనోత్తీర్ణా దేవేన దృష్టా, హృదయం చాస్య ప్రవిష్టా చ.—అం. 2.

(6) కర్పూరమంజరి.—

రాజా.—అహహ ఆశ్చర్య మాశ్చర్యమ్!

ఛా. య స్నాతాఞ్జనశోణలోచనయుగం లగ్నాలకాగ్రం ముఖం,
హస్తాలమ్బిత కేశపల్లవచయే దోలాయన్తే య ద్బిన్దవః,
య దేకం సిచయాఞ్చలం నివసితం, తత్స్నాన కేళీ స్థితా
అని తేయ మధ్బుతైకజననీ యోగీశ్వరే ణాముఁనా. 1 (26)

అపిచ.—ఛా. ఏకేన పాణికమలేన నివేశయన్తీ
వస్త్రాఞ్చలం ఘన స్తనస్థల సంసమానమ్
చిత్రే లిఖ్యతే న కస్యాపి సంయచ్ఛన్తీ
అన్యే న సా రమణత శ్చలితం కటివస్త్రమ్. 1 (27)
[రమణతః=జఘనాత్.]

విదూ.—(ఛా.)
స్నానావముక్తాభరణోచ్చయాయా। స్తరఙ్గభఙ్గక్షతమణ్డనాయాః
ఆర్ద్రాంశుకోల్లాసి తనూలతాయాః। సౌన్దర్యసర్వస్వ మస్యా దృష్టిః. 1 (28)

రాజా.—(పునస్తా మనుసంధాయ)

ఛా. త్రివళివళితనాభీ బాహుమూలేషు లగ్నం
స్తనకలశనితమ్బాదమ్బరే ష్వాచ్ఛ్వసత్
జలనిబిడిత మేతస్యాః శ్లక్ష్ణం స్నానవస్త్రం
పిశునయతి తనుయష్టిచఞ్చద్గమానం తారుణ్యం చ. 2 (24)

భవభూతి సూత్రించిన యీసూక్ష్మరహస్యమును దండియు గట్టిగా పట్టుకొన్నాఁడు:

(7) మల్లికామారుతము. అం. 4.

కలకణ్ఠః.—తతశ్చ

స్నానోత్థితా సలిలబిన్దు తరఙ్గితాఙ్గీ
సా సున్దరీ తటగతే మయి దత్తదృష్టిః
సంసక్తసూక్ష్మ విమలామ్బరలోభనీయ
శ్రోణీభరా మనసి మే లిఖితా స్మరేణ!

మారుతః.—సఖే హృదయఙ్గమాని ఖలు తరుణిమశిల్పిసముల్లిఖితాని నితమ్బినీనా మఙ్గకాని; విశేషతః స్నానోత్థితానామ్.

ఇట్లే శాకుంతలమందు మనస్సంగోత్పాదనార్థము కవి పన్నిన యీ భృంగాభియోగమునందలి "అకామాపిహి" అను పదము శృంగార రస మహావట విజృంభణార్హమయిన చిన్న బీజమై యున్నది.

## 3. కాఠిన్యముక్తస్తనమ్.

క్షామక్షామకపోల మాననం, మురః కాఠిన్యముక్తస్తనం,
మధ్యః క్లాన్తతరః, ప్రకామవినతా వంసౌ, ఛవిః పాణ్డురా,
శోచ్యా చ ప్రియదర్శనా చ మదనక్లిష్టేయ మాలక్ష్యతే
పత్త్రాణా మివ శోషణేన మరుతా స్పృష్టా లతా మాధవీ. 3 (33)

అను పద్యము గలదు. ఇందు "కాఠిన్యముక్తస్తనమ్"అను పాఠము సరిగా దనియు "కాఠిన్యయుక్తస్తనమ్" అని పఠింపఁదగుననియు కొందఱు బుద్ధిమంతులు హెచ్చరించినారు. దేహమంతయు అవసాదమొందుచున్న విరహావస్థలో కాఠిన్యయుక్తి యెట్లు వచ్చునని యడుగఁగా, మరువేఁడిచే తడి యిగిరి చన్నుగవ చుండి గట్టివడు నని వాదించిరి; చనువరు గగును, అని తేల్చిరి. అది తమ యనుభవమనియు వక్కాణించిరి. అనుభవమని నిరూపించినను, ఆవాదులు స్త్రీలుగానందున వారితో అట్లు తాము కని పట్టిన యీస్తనములు తమకై నిరహార్తింబడలేదనియు, పడినను, తత్పూర్వావస్థయందును నవి అట్లే యుండఁబోలు ననియు, నేనును వాదించి శైథిల్యమునకు ఈక్రింది యభిజ్ఞోక్తిని ప్రమాణీకరించితిని.

అనివక్ స్రగ్విణి వల్కెఁదన్ను జెలులారా నేలతాడ్డోలఁ జి
క్కున నూఁపం దెగి వ్రాల దీనిచనువ్రేఁకం బ్రేకియం దాల్తునో

యని పట్టక దినమధ్యమార్కరుచి ఖద్యన్మంజరు ల్వాని వా
డినపాలిండ్లను బెండుబొమ్మగతి నుండెక సందిటం జులకనై. ఆము. 5 (68)
ఖద్య త్తన్నమాటను వాడిన యనుటను పరికింపుఁడు.

## ౪. చ వజ్రే.

నైత చ్చిత్రం య దయ ముదధిశ్యామసీమాం ధరిత్రీ
మేకః కృత్స్నాం నగరపరిఘప్రాంశుబాహు ర్భునక్తి;
ఆశంసన్తే సురయువతయః సక్తవైరా హి దైత్యై
రస్యాధిజ్యే ధనుషి విజయం పౌరుహూతే చ వజ్రే.

'చ వజ్రే' అని పఠించిన, దుష్యంతధనువునకు ఇంద్రుని వజ్రాయుధముతో సామ్యము కలుగును; 'న వజ్రే' అని పఠించిన, దానికన్న ఉత్కర్ష కలుగును. మఱియు స్వర్వేశ్యలు 'పండుగునాఁడును పాతమగఁడేనా?' అను న్యాయంబున ఎల్లకాలము ఆవేగన్నులవేల్పునే కొలుచు చుంటకు విసివి, నడుమ ఎవని నేని దుష్యంతునివంటి క్రొత్తకానిని మహాసుందరాంగునిఁ జూడను, జేత యగు నాతనిమొల్ల నాడను, పాడను, అపేక్షించుట సహజము. తుదకు వైరుల నోర్చునదే యైనను గర్భనిర్భేదకమును శ్రవణవిదారకమును సర్వనాశకమును అగు నింద్రపవిచే అసురాదులనుండి తమ సంరక్షణము గోరక, సులువుగా జ్యాశబ్ద మాత్రమున వైరిహననముం గావించునదైన యీతని చాపముచేతనే తమ సంరక్షణం గోరుట న్యాయ్యము. దానం జేసి వారు పవిచే జయముం గోరక యితని వింటిచేతనే జయము కోరుదు రనునర్థము కలుగునట్టి 'న వజ్రే' పాఠమే శ్రేయము. ఇది మదూహితము. ఇది కవిహృదయము గాదేని 'సురయువతయః' అని యువతులం జెప్పుట వ్యర్థము. పురుషులం జెప్ప స్త్రీలం జెప్పుటచే ఆతని రప్పించుటకై వారు దైత్యులతో గిల్లి పిల్లి జగడములు తెచ్చుచుందు రనియు స్వారస్య మేర్పడును. ఇట్లు నాయూహించిన చిరకాలమునకు ఆపాఠమే ఒక తాళపత్రపుస్తకమందు దొరకిన దని నాతో శ్రీ దండిగుంట సూర్యనారాయణశాస్త్రి గారు చెప్పినారు. ఇప్పటికిని అది అచ్చులోను వ్యాఖ్యలలోను చేరలేదు. "న వజ్రే" అను పాఠముతో యువతి శబ్దస్వారస్యముకూడ నష్టమైనందున "సమితిషు సురాః" అను పాఠము కల్పితమైనది. దాన ఇంద్రతుల్యపరాక్రమతా మాత్రము విదిత మగును; సౌభాగ్యము స్ఫురింపదు.

## ౫. ద్వైధీభవతి మే మనః.

వెనుకకు నురులు నని యొకరు; రెండుపాయలై పాఱు నని యితరులు.

కృత్యయో ర్భిన్నదేశత్వా ద్వైధీభవతి మే మనః
పురః ప్రతిహతం శైలే స్రోతః స్రోతోవహం యథా. 2 (17)

దీనికి మదీయాంధ్రానువాదము.

"రెండుం గార్యము లొకచో । నుండమి నామనము చెదరుచున్నది రెండై,
కొండ నడి నడ్డ నే తెర । ఖండము లై పాఱుతెంచు కైవడి దోఁపన్."

అన్యదీయాంధ్రానువాదము ౧.

"రెండును రెండుచోట్ల నొకరింపఁగఁ దగ్గవి యౌటఁ గార్యముల్
రెండువిధంబులన్ మది చరింపుచున్నది నాకు నియ్యెడన్
గొండను వచ్చి కొట్టుకొని ఘూర్ణిలి వెన్కకుఁ బాఱునట్టియు
ద్దండనదీప్రవాహము విధంబున నే నిపు డేమి సేయుదున్.

వెన్కకుఁ బాఱె దని నీతిశాస్త్రము చెప్పుచున్నది. ఎట్లన—

"బలీయసే ప్రణమతాం కాలే ప్రహరతా మపి
సంపదో నాపగచ్ఛన్తి ప్రతీప మివ నిమ్నగాః." పంచ. 124 (7)

అన్యతరీయాంధ్రనువాదము ౨.

ఇట్టుం బని యట్టుం బని, పట్టెను డెందంబు రెండు పాయ లనుం దా
నెట్టయెదుట గట్టు దిరుగఁ, గొట్టినపెన్నేటి చాలుకోలుం బోలెన్.

దీనికి రాఘవభట్టవ్యాఖ్య—

కృత్యయో రితి కార్యయోః, మనసో ద్వైధీభవనం నానైకత్రపర్యవసానమ్। ఉపమానే తు మార్గద్వయగమనమ్। ఉభే భిన్నే అపి సమానధర్మార్థ మతిశయోక్త్యైకత్వే నాధ్యవసితే। పురోఽగ్రే శైలే ప్రతిహత మవరోధం ప్రాప్తం స్రోతోవహో నద్యాః స్రోతఇవ। అన్య దల్పం స్రోతః శైలావరుద్ధం తిష్ఠే దే వేతి సంబన్ధిపదోపాదానమ్। తత్రాపి నద్యాదిపదాభావేన యద్వైశిష్ట్యస్య గ్రహణం తేన మహానదీత్వం ధ్వనితమ్.

జీవానన్దవ్యాఖ్య.—ద్వైధీభవతి ద్విధా భూత్వా ద్వయో రేవ చలతి.

శారదారఞ్జనరాయవ్యాఖ్య—

ద్విర్ద్విభాగవిశిష్టం ద్వైధమ్। ......అద్వైధం ద్వైధం సంపద్యమానం భవతి ద్వైధీభవతి, ద్విధా విభక్తస్య భావం ధత్తే. తదీయాంగ్లానువాదము:—

[King—I am really perplxed.] The places of the two duties being different, my mind is divided into two, like the current of a stream struck against a rock in front.

వెనుకకుఁ బోవు వని యొక్క యాంధ్రానువాదము చెప్పుచున్నది. ఇతర టీకాకారులను వ్యాఖ్యలును 'చీలి రెండుపాయ లగుచున్నది' అనియు, 'మనఃపక్షము రెండు-పాయలగుచున్నది అనుటకు ఇతికర్తవ్యత ఏమియు తోఁపక క్లేశపడుచున్నది భావము' అనియు, చెప్పుచున్నవి. వెనుకకు తిరుగుట యసంభవము గావున అది యుక్తము గాదు. రెండగు ననుటయే సరి. అట్లే ద్వైధీభవతికి ప్రయోగములు:—ద్వైధం ద్వేధా ద్విధా అను మూఁడురూపములకు అర్థ మొకటే; కావున ఈ మూఁటిలో ఏది యున్నను ఇందలి యితరములకు మాఱుగాఁ గొనవచ్చును.

(1) శాకుంతలమందే "ధృతద్వైధీభావ కాతరం మే మనః—" అని దుష్యంతుఁడు తనలో ననుకొన్న ద్వైధీభావమును ఆతఁడే అనంతర వాక్యములో స్పష్టపఱచినాఁడు.

వైఖానసం కి మనయా వ్రత మాప్రదానా
ద్వ్యాపారరోధి మదనస్య నిషేవితవ్యమ్?
అత్యన్త మేవ మదిరేక్షణవల్లభాభి
రాహో నివత్స్యతి సమం హరిణాఙ్గనాభిః.

శ్రీనివాసటీక.—అనురూప వరాభిలాష ఏవ నిశ్చితో న వేతి సందేహోఽత్ర ద్వైధీభావః.

(2) శాకుంతలమందే, అం. 6.—"ఏక మేవ నౌ జీవితం ద్విధాస్థితం శరీరమ్"—

"మనస్సేమి రెండుగాఁ జీలు టేమి? అసంబద్ధప్రలాపముగా నున్నదే!" యని వెనుకకుఁ బోవు వారలు సల్లపించిరి. చీలుట యేమో లేదు గాని, మనస్సు రెండింటిలో దేని నవలంబింపను దెలియక మూఢావస్థలో నున్న దని లక్ష్యార్థమున మనస్సు చీలిపోయిన దనువ్యవహారము భవ్యమే. అట్టియర్థముననే ఆకరములందు మనస్సు చీలె నని, రెండుమనస్సు లని ఇత్యాదివర్ణనలు కలవు.

నలానలోభయపర భారతీవాక్యమును విని దమయంతి నలుఁడో అనలుఁడో నిశ్చయించుకొన లేక పలుకు వచనము:—

(3) సాధారణీం గిర ముభయార్థనైషధాభ్యా
మేతాం నిపీయ న విశేష మవాప్తవత్యా
ఊచే నలోఽయ మితి తం ప్రతి చిత్త మేకం
బ్రూతే స్మ చాన్య దనలోఽయ మితీదమీయమ్. నైషధము.

"చిత్తం మనః" అని నారాయణవ్యాఖ్య.

ప్రకృతోపయోగులు కొన్ని ప్రయోగములు:—

(4) కోదణ్డా త్తరళ ముదఞ్చితః శరస్య
ద్రా గ్ద్వేధా వ్యధిత సుధారయా సుబాహుమ్.—బాలరామాయణము. 3 (8)

(5) లగ్నం చేతో మమ నిజతనా స్వర్ణతాళాభిఘాత
వ్యాజా దేషా ద్రఢయతి ముహుః కుట్టనే నేవ తక్షా,
ఆక్రష్టుం త త్కథ మివ మనః శక్యతే కీదృశీ చ
ద్వైధీభావే హృదయవపుషోః స్యా ద్దశా దేహభాజామ్. రససదన. 226.

(6) ద్వేధా స్తమ్భితపత్తిపఙ్త్తివికటః పన్థాః పురస్తా దభూత్- మాలతీ.8 (9)
"ద్వేధా—పార్శ్వయోః" అని టీక.

(7) అసౌ ధన్యో యూనాం యదురసి విశాలే మృగదృశః
స్తనాభ్యాం సంక్రాన్తో దృఢతరపరీరమ్భసమయే
ద్విధా వృత్తాకారో వలయజరసోఽయం మమ దృశో
ర్వ్యధూటీ వక్షోజద్వితయ పరిణాహం కథయతి.— శృఙ్గారతిలక. 27

శివధనుస్సును శ్రీరాములవారు రెండుతుండెములుగా విఱిచిన ఘట్టములలో ఇట్టి వాక్యములు లున్నవి:—

(8) సీరోత్కృష్టే ర్యదమృతభుజాం నిర్మమే పద్మయోని
స్తస్య ద్వైధం వ్యధిత ధనుష శ్శామ్భవీయస్య రామః.— మహావీర. 2 (2)

ఈక్రిందిది మహానాటకమునం బరశురామవాక్యము—

(9) పార్వత్యా నిజభర్తు రాయుధ మితి ప్రేమ్ణా య దభ్యర్చితమ్,
నిర్మోకేన చ వాసుకే ర్నిచుళితం య త్సాదరం నన్దినా,
భవ్యం య త్త్రిపురేన్ధనం ధను రిదం త న్మన్మథోన్మాథిన,
స్స త్యేవం భువి రామనామని మయి ద్వైధీకృతం దృశ్యతే.— 52 (5)

కథాసరిత్సాగరంబున ఈ క్రిందిశ్లోకములు.—

(10) కిం తత్ర తే తద్ధి పురం చిరశూన్యం తథాఽపిచేత్
యాసి; త చ్ఛృణు, మార్గోఽయం పురత స్తే ద్విధా గతః ;
తత్ర వామేన గచ్ఛే స్త్వం పథా యావ దవాప్స్యసి
ప్రతోళీం ఖణ్డవటక స్యోచ్చప్రాకారహారిణీమ్.— పు. 679 (71)

(11) గేహిన్యా హ్రియమాణం నిరుధ్యమానం నవోఢయా పురతః
మమ నాకాద్వితయార్పితగుణ ఇవ హృదయం ద్విధా భవతి. ఆర్యా స. ౫. 16.

జానకీహరణమందు—5 (47)

(12) జవేన కశ్చి జ్జవనోఽమ్బుదోపమం। క్షణం సితాభ్రైః కృతకర్ణచామరమ్.
నిపత్య కుమ్భే తరసా ద్విధాగతైః। విహాయసా వాహయతి స్మ దన్తినమ్.

శ్రీకుమారశతకమందు ఈ క్రిందిప్రయోగములు కలవు.—

(13) ద్విధాభూత్వా శశీ వాలవ్యజనచ్ఛలతో భజేత్
కుమార త్వాం లాలసయా యత స్త్వం భూమహేశ్వరః. 32

(14) భజియించుఁ గాక వాల। వ్యజనవ్యాజమున నిన్ను ద్వైధీభావం
బు జనింపఁగఁ జంద్రుఁడు నీ। వ జగత్పరమేశ్వరుండ వగుటఁ గుమారా. 36

కథాసరిత్సాగరము. లం 10. త 6. శ్లో. 172=6.

ఇదం చ శ్రూయతా మన్య న్మాళవే భ్రాతరా వుభౌ
(15) విప్రా వభూతాం మద్వైధం తయోః పిత్ర్య మభూ ద్ధనమ్.
విభజ్యమానే చార్థేఽస్మిన్ న్యూనాధిక వివాదినౌ
స్థేయీకృత ఉపాధ్యాయ శ్ఛన్దస స్తా వభాషత
వస్తువస్తు సమే ద్వేద్వే అర్ధే కృత్వా విభజ్యతామ్
యువాభ్యాం యేన నైవ స్యా న్న్యూనాధికకృతః కలిః.
తచ్ఛ్రుత్వా వేశ్మ శయ్యాది భాణ్డం సర్వం పశూ నపి
(16) ఏక మేకం ద్విధా కృత్వా మూఢౌ విభజతః స్మ తౌ.
(17) ఏకా దాసీ తయో రాసీ త్సాపి తాభ్యాం ద్విధా కృతా.
త ద్బుద్ధ్వా దణ్డితౌ రాజ్ఞా సర్వస్వం తాం వుభా వపి.

(18) శత్రూం స్తన్మిత్రవర్గం చ ద్వైధీకృత్య ప్రయత్నతః
కుమార నిపుణై శ్చారై శ్చక్షుష్మాన్ భవ సర్వతః. కుమారశత. 51

సరస్వతీ కంఠాభరణంబున,

(19) కో నామ నోదయతి నాస్త ముపైతి కో వా?
లోకోత్తరః పున రయం సవితా జగత్సు:
య త్రోదయాస్తమయభాజి రుచాం నిదానే
ద్వేధాభవ త్యహ రితి క్షణ దేతి కాలః. 5 (656)

సూర్యశతకమున—

(20) "ద్వేధావ్యస్తామ్బు వాహావళి విహిత బృహత్పతు విక్షేప శోభః" 64

కాదంబరినుండి ఈయనంతరోదాహరణము ప్రకృతార్థ సిద్ధాంతీకరణమునకు సాధకతమముగా నున్నది :—

(21) "జఘనశిలాతలప్రతిఘాతా ల్లావణ్యస్రోత ఇవ ద్విధాగత మూరుయుగ్మం దధానాం దదర్శ"— పూర్వ. 368 పు. (7)

కాళిదాసీయ మయిన కృత్యయోరిత్యాది శ్లోకార్థమును మనంబున ననుసంధించియే బాణకవి యీవర్ణన నిటుఁ గావించియుండఁబోలు నని యూహింపఁదగియున్నది.

## ౭. నాగరికఃస్యాలః X నాగరికస్యాలః

ఇది సమస్తమా వ్యస్తమా ?

## 5, 6-వ యంకములకు నడిమి ప్రవేశకము.

"తతః ప్రవిశతి నాగరికః స్యాలః పశ్చాద్బద్ధం పురుషమాదాయ రక్షిణౌ చ" అని యొక మతమున కవివాక్యము.

ఇచ్చట ఈనగరనియుక్తుఁడు ఎవరిస్యాలుఁడు ? రాజస్యాలుఁ డని రాఘవభట్టు.- "నాగరికో నగరరక్షాధికృతః స్యాలో రాజస్యాలః । కోష్ఠపాల ఇతియావత్." దీనినే శారదారంజన రాయపండితుండు అంగీకరించినాఁడు. రాజబావమఱఁది (రాజధానీ) కోష్ఠపాలుఁడుగా నుండుట హమ్మీర మహాకావ్యమందునుం గలదు. అయినను, ఇందు అడుగఁదగినవి కొన్ని కలవు. రాజులకు కులభార్యాభ్రాత యగుస్యాలుఁడును, ఉంపుడుగత్తెసోదరుఁ డగుస్యాలుఁడును ఉండవచ్చును. అందులో రెండవ తెగవానిని నాటకములలో శకారుఁ డందురు. వానికి శాకారి యనెడి యొకనికృష్ట ప్రాకృతమును పెట్టుదురు. వాఁడు మహామూర్ఖుఁడుగా నుండును. రాజనియోగనిర్వాహణమునకు అర్హుఁడు కాఁడు. అట్టివాఁడు మృచ్ఛకటియందుఁ గలఁడు. ఇచ్చటి యీస్యాలుఁడు అట్టివాఁడుగా నుండలేదు. మఱియీతఁడు రాజుగారికులభార్యాభ్రాత యగునా ? ఆపక్షమున, ఇతఁడు రాజోచిత మైన సంస్కృతమును పలుకక పరమనీచోచిత నీచప్రాకృతమును పలుకనేల ? సారాయిసాక్షిగా నేస్తము కట్టుటకు చెంబడివానిని సారాయిగిడ్డంగికి కొనిపోయె నేమి ? కావున, వీఁడు రాజునకు కులగౌరవములుగల బావమఱఁది యనుట సరిపడలేదు. వీఁడు నగరనియుక్తుఁ డెవఁడో హానిబావమఱఁది కాఁబగు. పనిలో వీనిని ఆనియుక్తుఁడు తరిబీయతు చేయుచున్నాఁడనియు, అతనికి అపరాధులతోడి కృత్యము మెండగుటంబట్టి వీనిని ఇట్లు పంపినాఁ డనియు తలంచు టొప్పును. ఏతన్మతానుగుణముగా వైఖానసశ్రీనివాసాచార్యనివ్యాఖ్యలో "నాగరికస్యాలః" అని సమస్తపదముగా నున్నది. అతని

టీక- "నగరే నియుక్త ఇతి నాగరికః తత్ర నియుక్త ఇతిఠక్ప్రత్యయః, నగరపాలక ఇతి యావత్। తస్య స్యాలః పత్నీభ్రాతా."

శాకుంతలషష్ఠాంకములో ఉద్యానపాలికలు వసంతోత్సవము చేయుచుండిరి. అందులకు కంచుకి కోపింపఁగా ఈసమాధానమును విన్నవించుకొనిరి.

ఛా. ఆర్య కతిదివసా న్యావయో ర్మిత్రావసునా రాష్ట్రియెణ భర్తుః పాదమూలం ప్రేషితయోః? అత్రచ నౌ ప్రమదవనస్య పాలనకర్మ సమర్పితమ్। త దాగన్తుకతయా అశ్రుతపూర్వ ఆవాభ్యా మేష వృత్తాన్తః.

ఇట "భట్టినీ పాదమూలమ్" అని ఛాయాపాఠాంతరము, ఇందులమూలమైన ప్రాకృతవాక్యము "భట్టిణోపాఅమూలమ్" "భట్టిణీపాఅమూలమ్" అనునది. ఇందుం గల ణోణీభేదము వ్రాఁతలలో చక్కఁగాఁ దెలియమి యీభ్రమకు కారణమైనది గావలయును. ఇచ్చట "రాష్ట్రియేణ నగరపాలేన రాజస్యాలేన మిత్రావసునా" అని రాయటీక. ఇందుల కాతనియాంగ్లానువాదము:—

Noble Sir, a few days only have passed to us sent near the feet of sire by Mitravasu the King's brother-in-law. And here the work of keeping the pleasure gardens was placed with us. Thus through our being strangers, this matter was not heard by us before.

ఇట నించుక ప్రష్టవ్యము కలదు. ఈమిత్రావసువే (ప్రవేశకమందలి) నగరపాలుఁడు రాజస్యాలుఁడు నని పై టీకాకారుల భావముగదా. అతఁడే అగుపెడల అతనిపేరు మిత్రావసు వని అక్కడ చెప్పక ఇటం జెప్పుట యేమి? అచ్చట ఈ పేరు చెప్పక (రాజ) స్యాలుఁ డని పేర్కొని ప్రవేశపెట్టినప్రయోజన మేమి? ఒకమాఱయినను ఇంచుకేనియు నితఁడు బడాయి కేనియు ఆనుషంగికముగా నేనియు తన రాజసంబంధమును చెప్పుకోలేదే? రక్షులేని ఆమాట పలుకలేదే? మఱి ఆరక్షులు ఇతనిని తమపైయధికారి యని గౌరవముం దెలుపుపదముల సంబోధింపక "ఆవుత్త" (బావా) అని సంబోధింప నేల? ఛాయాపాఠభేదము ఇంకనొకటి కలదు.—— "ఆర్య కతి దివసాని గతా న్యావయో ర్మిత్రావసునా రాష్ట్రియేణ ప్రేషితయో ర్భర్తుః పాదమూలా దత్ర చరన్త్యోః। ఇదం చ నామ ప్రమదవనస్య సకలం ప్రతికర్మార్పితమ్. తస్మా దశ్రుతపూర్వ ఆవాభ్యా మేష వృత్తాన్తః" — మదరాసు తెలుఁగుముద్రణము శ్రీనివాసవ్యాఖ్యాసమేతము. అందులో ఈవాక్యమునకు టీక లేదు. ఇట "ఇదం చ" అను చకారముచే మేము వచ్చినవెంటనే అని యర్థము కలుగుచున్నది. ఈపాఠముప్రకారము ఈబాలికలు రాజుకడను ఉండినవారే యఁటుఁ

మఱి వీరికి వసంతోత్సవ నిషేధము తెలియ దఁట; వీరు అంతఃపురమువారే యైన తోఁట పనికి వచ్చినపిమ్మట మఱి యంతఃపురమువారి నెవరినిం గలసికొనరా? మఱి రాజును సన్నిధిలో నుండి కొలుచుచుండినవీరిని తోఁటపనికి నాగరికస్యాలుఁడు పంపుట యెట్టిది? వాఁడును రాజుతోఁగూడ రాచనగరనే నివసించువాఁడా? వానికి రాచ నగరఁ గూడ రక్షణాధికారమా? వానిని 'సేవితం నా మావృత్తేన?' అని యాఱకు లడుగుటయుం గనుఁడు. ఇందుల సమాధానము.—ఈమిత్రావసువు ఆ నాగరిక స్యాలుఁడు గాఁడు. ఇతఁడు ఎక్కడనో అంతపాలదుర్గమునందు రక్షకుఁడు— 'గవర్న' రనుట. ఇతఁడు ఆయిరువురను ఉద్యానపాలనకర్మనిపుణలని తన ప్రభు వునకు దుష్యంతునికి కానుక పంపినాఁడు. వారు ఈ నగరమునకు వచ్చి అల్ప కాల మయినది. వచ్చినవెంటనే తోఁటపనిలో వారిని పెట్టినారు. ఇప్పటి జను లతో ఇంకను పరిచిత పడనందున వారికి ఈ వసంతోత్సవ నిషేధవృత్తాంతము తెలి యలేదు. బావమఱఁది దూరమున దండనాథుఁ డనుటచే ప్రకృతినాటకకర్త రాష్ట్ర విస్తారము బోధపడును; దాన నితని సార్వభౌమత్వాదులు స్ఫురించును. ఇట్లే బావమఱఁది దూరమున దుర్గాధిపతిగా నుండి రేనికి కానుకగా ఇరువుర శిల్పకారి కలం బంపుట మాళవికాగ్నిమిత్రమందునుం గలదు. ఎట్లన—

వకుళావళికా—(ఛా.) అస్తి దేవ్యా వర్ణావరో భ్రాతా వీరసేనో నామ; స భర్త్రా
అన్తపాలదుర్గే మన్దాకినీతీరే స్థాపితః...... అం. 1

రాజా—వీరసేనప్రముఖం దణ్డచక్ర మాజ్ఞాపయ.

సారసకః—(ఛా.)...దూతశ్చ తేన (వీరసేనేన) మహాసారాణి రత్నవాహనాని శిల్ప
కారికాభూయిష్ఠం పరిజనం చోపాయనీకృత్య భర్తు స్సకాశం ప్రేషితః. అం.5

కఞ్చుకీ—...అమాత్యో విజ్ఞాపయతి। తస్మిన్ విదర్భవిషయోపాయనే ద్వే శిల్పకా
రికే మార్గపరిశ్రమా దలసశరీరే ఇతి కృత్వా న ప్రవేశితే। సంప్రతి దేవోపస్థాన
యోగ్యే। త దాజ్ఞాం దేవో దాతు మర్హతి॥

అనంతరము ఆకన్యలు సంగీతనిపుణలు ప్రవేశింతురు.

## II. మాలతీమాధవము.—కపోలకుఙ్కుమాని.

మాధవుఁడు మధ్యాహ్నసమయమందు మాలతీగతమును ధ్యానించుచుండుట.

"ఘర్మామ్భోవిసరవివర్తనై రిదానీం
ముగ్ధాక్ష్యాః పరిజనవారసున్దరీణామ్,
తత్ప్రాప్తి ప్రతిర్నిహితవిచిత్రపత్త్రిరేఖా
దగ్ధ్వం జహాతి కపోలకుఙ్కుమాని."

ఇందుఁ జెప్పఁబడిన కపోలము లెవరివి ?

"తస్యాః పరిచారికాణాం కపోలకుఙ్కుమాని" అని త్రిపురారివ్యాఖ్య. ఇందు వలన, చెమ్మటబొట్టులు ఉరలి మాలతీ (నాయికా) పరిచారికల కపోలములందలి యానిపుణతరపత్త్రికారచనను చెఱిపి వైచు ననియు, అట్లు చెడునే యని మాధవుఁడు (నాయకుఁడు) చింతించుచున్నాఁ డనియు, నేర్పఁడును. నాయకుఁడు నాయికా గతమును చింతించుట యుచితము. పరిచారకుఁడు పరిచారికాగతమును చింతించుట యుచితము. ఇక్కడ విపరీతముగా నున్నది. ప్రస్తుతకపోల కుంకుమములు మాలతివిగా వనుటకు జగద్ధరుఁడు— కన్య యయినందున మాలతికి కపోలములందు కుంకుమ పత్త్రములు రచితములు గావు,—అని ఉపపత్తి వ్రాసినాఁడు. "మాలత్యాః కన్యాత్వేన పత్త్రావళ్యభావాత్ పరిచారికే త్యుక్తమ్." ఈ టీక సరి గా దనియు, కపోలకుంకుమములు మాలతివే అనియు, (విచిత్రపత్త్రిరేఖా) వైదగ్ధ్యము పరిచారికల దనియు, నాయకుఁడు నాయికాగతమునే చింతించుచున్నాఁడనియు, మదభిప్రాయము. ఎండచే చెమటకు పరిచారికారచిత పత్త్రిరేఖావైదగ్ధిశోభను నాయికాకపోలయుగళము కోలుపోవు నని మాధవునిచింత యని కవిహృదయము.—కన్యకుం బత్త్రిరచనలు కలవు.

పుష్పేషు శ్చికురేషు తే శరచయం త్యక్త్వాలమాలే ధనూ
ర్భ్రూ దే చక్షుషి యజ్జిత స్తను మనుభ్రాన్త్రిం చ య శ్చిక్షిపే
నిర్విద్యాశ్రయ దాశ్రమం స వితనుః స్వాం తజ్జయా యాధునా
పత్త్రాళి స్త్వదురోజశైలనిలయా తత్పర్ణశాలాయతే. నైష. 3 (128)

ఇది దమయంతిం గూర్చి దూత్యమున హంసవాక్యము. ఇందు నలుని జయించుటకై మదనుఁడు దమయంతీస్తనశైలగతపత్త్రికాపర్ణశాలయందు తపస్సుచేయుచున్నాఁ డని వర్ణన.—కాదంబరీకథాసారములో—

"చిరం పత్త్రిలతాలేఖ్యం విహాయ క్రియతే నవమ్
మణ్డనం గణ్డయో ర్రశుకణముక్తావళీ తయా." 6 (20)

"అవస్రస్త ప్రతిసమాహిత కర్ణపూరీకృత (కర్ణపూర ?) పల్లవానిలశోషిత కపోల పత్త్రభఙ్గ దూషి ఘర్మ సలిలాఙ్కురం...కస్యా శ్చి దారబ్ధకన్దుక క్రీడాయా కన్యాయాః పాణితలతః పరిభ్రశ్య పునః పతన్తం కన్దుక మైక్షిష్ట."

గద్యచింతామణి, పు. 122 (10

"ఉద్దామ రోమహర్షణ స్వేదోద్భేద సాదిత ప్రకృతి మకరికాపత్త్రాంగ రాగయు" అని ప్రభావతికి విశేషణము. ప్రభా. ప్రద్యు. 5 (32)

ప్రకృతశ్లోకములో "ముగ్ధాక్ష్యాః" అనుపష్ఠికిఁ "కుఙ్కుమాని"తోను, "సున్దరీణా"మనుషష్ఠికి "వైదగ్ధ్యము"తోను, అన్వయ మని వివేకము. త్రిపురారిజగద్ధరుల

పతమే తనహృదయమేని కవి "ముగ్ధాక్షీపరిజనవారసున్దరీణామ్" అని సమస్తముగా పఠించి యుండును. ఇక్లే—మాలతికి టీకయు ననం దగిన మల్లికయందు మాధవుఁడు నాయికా (మల్లికా) గతమును తాత్కాలికమును ప్రథమాంకాంతమున తలపోసి కొనును. చెమటయు నాయికాకపోలపత్త్రిములును అందునుం గలవు.

"మన్యేఽద్య శ్రమవారిభిన్నతిలకా సేవేత వల్లీగృహాన్
ఆళీనాం కరతాళవృన్తపవనైః సంవీజ్యమానా శనైః
ఆహో స్వి ద్విసభఙ్గకఙ్కణవతీ పత్త్రామ్బుసిక్తాననా
కర్పూరార్పణపాణ్డరస్తనభరా వర్తేత ధారాగృహే." అం. 1

"స్నిగ్ధస్మేర విలోల ముగ్ధ మధురా య న్నేత్రయో ర్విభ్రమాః
య ద్వ్యామృష్టవిలాసపత్త్రిలతికా ఘర్మోద్గమా గణ్డయోః
య చ్చ ప్రౌఢకదమ్బకుట్మలసఖీ కాఽప్యఙ్గకే విక్రియా
త త్తస్యాం కిమపి స్ఫుటం రతిపతే ర్దోర్దణ్డవిస్ఫూర్జితమ్."

మాలతియే మల్లికయనం దగును. ఉద్దండకవి మెఱుగువెట్టదొరఁకొన్నవాఁడు. అందుకై యింమకతారాఙ్కణము.—

| మాలతి (గ్రంథాది) | మల్లిక (గ్రంథాది) |
| --- | --- |
| చూడాపీడకపాలసంకులగళ న్మన్దాకినీవారయో | చూడాశీతకరస్తనన్ధయసుధా నీరన్ధ్రిగన్ధస్పృశః |
| విద్యుత్ప్రాయలలాటలోచనశిఖా జ్యోతిర్విమిశ్రత్విషః | క్రీడాకఙ్కణపన్నగేశ్వరఫణా పీతావశిష్టా ముహుః |
| పాన్తు త్వా మకఠోరకైతకశిఖా సన్దిగ్ధముగ్ధేన్దవః | అఙ్కాసీనగిరీన్ద్రజాస్తనతటీ హారావళీలోలనాః |
| భూతేశస్య భుజఙ్గవల్లివలయ స్రఙ్నద్ధజూటాజటాః॥ | సంతాపం శమయన్తు వో హరజటా గఙ్గాతరఙ్గానిలాః॥ |
| పష్మాళీపిఙ్గళిమ్నః కణ ఇవ తటితాం యస్య కృత్స్నః సమూహో | కల్యాణం వః క్రియాసు ర్మ్రదటనిగుణ స్థాన్నుగీర్వాణభోగి |
| యస్మిన్ బ్రహ్మాణ్డ మీషద్విఘటితముకులే కాలయజ్వా జుహావ | స్త్రైణవ్యత్యస్తకల్పద్రుమనవసుమనో నాగహారావళీని |
| అర్చిర్నిష్టప్తచూడాశశిగళితసుధా సారఝూత్కారికోణం | నాళీకాశ్లిష్టలక్ష్మీకరచలనలినో ద్వాన్తమాధ్వీకధారా |
| తార్తీయీకం పురారే స్త దవతు మదన ప్లోషణం లోచనం వః॥ | తిష్యత్సాక్షేక్షణాని త్రిపురహరధను ర్జ్యాలతాకర్షణాని॥ |

# III. మహావీరచరిత్ర.

## ౧. స్ఫూర్జత్.

విశ్వామిత్రాశ్రమమున కుశధ్వజధ్యాతావిర్భూత శివధనుర్వర్ణనము:—

స్ఫూర్జ ద్వజ్రసహస్రనిర్మిత మివ ప్రాదుర్భవ త్యగ్రతో
రామస్య త్రిపురాన్తకృ ద్దివిషదాం తేజోభి రిద్ధం ధనుః.

"స్ఫూర్జతాం శబ్దతాం (?) వజ్రాణాం దమ్భోళీనామ్" టీక.

ఈధనుస్సు ఎప్పుడును ఆస్ఫూర్జథువును విడువనే విడువదా? వచ్చినపిమ్మటను అట్లే ఆనవరతము నిర్ఘాతధ్వానము సేయుచునే యుండెనా? అట్లుండదు గావున "వజ్రసహస్రనిర్మిత మివ స్ఫూర్జత్" అని యన్వయింపవలయును.

## ౨. దూరాద్దవీయః.

"దూరాద్దవీయో ధరణీధరాభం। య స్తాటకేయం తృణవ ద్వ్యధూనోత్
హన్తా సుబాహో రపి తాటకారిః। స రాజపుత్రో హృది బాధతే మామ్."

ఇట "దూరాద్దవీయః" అను శబ్ద సముదాయమునకు 'దూరముకన్న దూరమునకు' అత్యంతదూరమునకు అని యర్థము. ఇట వ్యాఖ్యాతలు సందేహ పడినారు. 'దూరాద్దవీయాన్" అని పాఠమును మార్చుకొన్నారు. కొందఱు "దవీయః" అనియే పాఠము నంగీకరించి "దూరాత్ అతిదూరే ఇత్యర్థః" అని మదుక్తార్థమును కూడ అంగీకరించినారు. "దూరాద్దవీయః" అను నీ శబ్దసముదాయమునకు "అతిదూరము" అనునర్థమున వాఙ్మయమందు ప్రయోగములం గనవచ్చును.

"దూరాద్దవీయో నీత్వా చ తయా సుకృతరక్షితః
నద్యాః కస్యాపి నగర స్యాసన్నే సో౽ర్పిత స్తటే." కథా. పు. 391 (21)

"సఖే దూరాద్దవీయ స్త ద్యత్రావాం గన్తు ముద్యతౌ
తత్రాగన్తుం త వేచ్ఛాచేత్ కార్య మస్మద్వచ స్త్వయా." 360 (171)

"తస్మి న్నారుహ్య వాతాశ్వే జవా దన్వపత చ్చ తమ్,
పరాహం విద్రుతం రాజా భూమిం దూరాద్దవీయసీమ్." 666 (14)

"దవీయస్యో దూరా దపథ మిహ చాముత్ర చ శుచాం
త్రివేదీవాక్యానా మనతిచిరభగ్నా ఇవ ఖిలాః
శ్రుతిగ్రాహ్యం జ్యోతిః కి మపి బహిర న్తర్మలముషః
మృజాయా మజ్జానః క్వను విపరియన్తి ద్విజగిరః." మురారి.

కావున ప్రకృతమున శ్రీరాముఁడు మారీచుని అతిదూరమునకు అనఁగా విశ్వామిత్రాశ్రమమునుండి దక్షిణసముద్రములోనఁ బడునట్లు (వాయవ్యాస్త్రముచే) నెగురఁ గొట్టినాఁ డని యర్థము.

## 3. అపి తాటకారిః.

వ్యాఖ్యాత "స తాటకారిః సుబాహో రపి హన్తా రాజపుత్త్రో౽యం హృది బాధతే" అని యన్వయము వ్రాసినాఁడు. దీనిచేత అపిశబ్దము సుబాహుపదముతో చేరును. మారీచుని దూరమునం బాఱవైచుటకంటెను, తాటకను సంహరించుటకంటెను సుబాహువును గూల్చుట ఎక్కుడు బీరముం దెలుపుకృత్యముగా నేర్పడును. ఇది కవిహృదయము గాదు. ఈమూఁడు కృత్యములలోను "తాటకావధనమే" ఉత్కృష్టము. అట్లని మహావీరచరిత్రరసము నెఱింగినమురారికవి తెలియఁబఱిచినాఁడు:—

"వాయవ్యాస్త్రవ్యతికరనిరాలమ్బన స్తాటకేయః
ప్రాప్తో జీవన్మరణ, మసుభి ర్విప్రయుక్త స్సుబాహుః,
కృత్తోన్మృక్తా భువి చ కరుణాశ్చర్యబీభత్సహాస
త్రాసక్రోధో త్తరళ మృషిభి ర్దృశ్యతే తాటకేయమ్."

అందలి యపిశబ్దమునకు ఇందలియుత్తరార్ధము విస్తరము. తాటకనుగూడ సంహరించినవాఁ డని యాశ్చర్యము. 'తాటకారి రపి' అని యన్వయించుట సరి. ఈరామకథాకవులు తాటకాగతమును మూఁటిలో ఎక్కుడుగా ప్రయత్నపూర్వకముగా పోటెగా వర్ణించిరి. అందువలన అపిశబ్దమును ఎందుతో చేర్పవలయునో తెలియును:—

భవభూతి—మహావీరచరితలో నే-

అన్త్రప్రోత బృహత్కపాల నళకక్రూరక్వణత్కఙ్కణ
ప్రాయప్రేఙ్ఖితభూరి భూషణరవై రాఘోషయ న్త్యమ్బరమ్,
పీతచ్ఛర్దిత రక్త కర్దమఘనః ప్రాగ్భార ఘోరోల్లల
ద్వ్యాలోల స్తనభార భైరవవపు ర్దర్పోద్ధతం ధావతి. 1 (35)

రాజశేఖరుఁడు—బాలరామాయణమున-

తత శ్చ సపుత్రదారేషు దిగన్తరా దాగతేషు మునిజనేషు కి మిదమితి కాన్దిశీకేషు తత్ర త్యే నోదఘోషి జనేన.—

"రక్తాభ్యక్తోరస్పృక్కా గురుకబళగళజ్జాఙ్గలవ్యగ్రతాలుః
ఫేత్కారైః ఫుల్లగల్లవ్యతికరగురుభిః కమ్పయన్తీ జగన్తి
అన్యోన్యే నాగ్రపాణిప్రణయి శవయుగం తాడకా తాడయన్తీ
సేయం ద్రాగ్దష్టదంష్ట్రాఝుత్కరకవణరణత్కారభీ మాఽభ్యుపైతి." 3 (3)

తాటకాహననము:—

"కాళరాత్రికరాళేయం స్త్రీతి కిం విచికిత్ససే
తజ్జగత్త్రితయం త్రాతుం తాత తాడయ తాడకామ్."

"విధ్వస్త హస్తయుగళం గళితాన్త్రతన్త్రి
మున్ముక్తరక్తతతి ఖణ్డితకాలఖణ్డమ్
ఉత్కృత్తకృత్తి రచితం చ శరైః శరీర
మార్యేఽఖిలాఙ్గపరితాడిని తాడకాయాః"

కడమయాయిరువురకును ఒకటే శ్లోకము :—

కోదణ్డాత్తరళముదఞ్చితశ్శరస్యాద్రాగ్ద్రేధా వ్యధిత సుధారయా సుబాహుమ్
మారీచం సపది చ పుఙ్ఖపత్త్రివాతైరమ్భోధేః పులినచరం చకార రామః 3(8)

మహావీరచరితమందే తాటకాహననము—

హృన్మర్మభేది పతదుత్కటకఙ్కపత్త్రి
సంవేగతత్క్షణకృత స్ఫుటదఙ్గభఙ్గా
నాసాకుటీరకుహరద్వయ తుల్యనిర్య
దుద్బుద్బుదధ్వనదసృక్ప్రకరా మృతైవ. 1 (39)

మురారి - తాటకావర్ణన - స్రగ్ధర.

నిర్మజ్జత్సు రన్ధ్రేష్వమదతికపిశకూరతారా నరాస్థి
గ్రన్థిం దన్తాన్తరాళ గ్రథిత మవిరతం జిహ్వయా ఘట్టయన్తీ
ధ్వాన్తేఽపి వ్యాత్తవక్త్రజ్వలదనలశిఖాజర్జరే వ్యక్తకర్మా
నిర్మాన్తీ గృధ్రరాద్రిం దివ ముపరి పరిక్రీడతే తాడకేయమ్. 2 (54)

మారీచ సుబాహులకు ఇరువురకుం గలిపి ఇతరులతోఁగూడ ఒకటే యనుష్టుప్పు;

త్రేతాగ్ని కుణ్డపూరం చ వక్షోరుధిరచ్ఛటాః
హింస్రాస్సుబాహుమారీచమిశ్రా నః పరివృణ్వతే. 55

బ్రహ్మవరముచే సింధురసహస్రప్రాణ యైన తాటకను సుకుమార రచనాచతురతా ధురంధరుఁడు భోజరాజు ఇట్లు వర్ణించుచున్నాఁడు.—

తత్కాలే పిశితాశనాశపిశునా సద్యేవ కాచిన్నభో
రథ్యానం తరసా రురోధ రుధిరక్షోదారుణా దారుణా
స్వాధీనే హననే పురీం విదధతీ మృత్యోస్స్వకృత్యాత్యయ
క్రీడత్కిఙ్కరసంఘసఙ్కటమహాశ్మశానాటకా తాటకా.

కావున అపశబ్దమును తాటకతోనే చేర్చుట సమంజసము.

## IV. అనర్ఘరాఘవము.

"వాయవ్యాస్త్రవ్యతికరనిరాలమ్బనస్తాడకేయః
ప్రాప్తో జీవన్మరణ మసుభి ర్విప్రయుక్త స్సుబాహుః."

ఈశ్లోకమున టీకాకారుఁడు కష్టం దడఁబడి "తాడకేయః" అనుపదమును తాటకాసుతార్థముగా "సుబాహునికి విశేషణముగాఁ గొని ఈపూర్వార్ధము ఒక్క సుబాహువధవర్ణనముమాత్రమే అగునట్లు వివరించినాఁడు.

"అయం తాటకేయ స్తాటకాపుత్త్ర స్సుబాహు ర్జీవన్మరణం ప్రాప్తః। శక్త ఏవ మారిత ఇతి భావః. అతఏవ ఆసుభిః ప్రాణై ర్విముక్త స్తద్యుక్తః."

ఇదంతయు పొరఁబాటనియు, "తాటకేయః" అనఁగా నిట మారీచుఁడే యనియు, జీవన్మరణము సముద్రములో బ్రతికియు దాఁగియుండుట యనియు, అది వాయవ్యాస్త్రప్రభావకృత మనియు, సుబాహువుకూడ నిహతుఁ డనియు గ్రహించుట సరి. మారీచుని జీవన్మరణమును భోజరాజు ఇట్లు వర్ణించినాఁడు:—

మారీచనీచమతి రాహవ మార్గచయ్యా
క్షిప్తః క్షణేన రఘునాయకసాయకేన
మధ్యేపయోనిధి భయేన నిమగ్నమూర్తి
ర్వేపం పుపోష జలమానుష నిర్విశేషమ్.

## V. విక్రమోర్వశీ—ఉపసృత్య.

"ఊరూద్భవా నరసఖస్య మునే స్సురస్త్రీ
కైలాసనాథ ముపసృత్య నివర్తమానా
బన్దీకృతా విబుధశత్రుభి రర్ధమార్గే
క్రన్ద త్యతః శరణ మప్సరసాం గణో౾యమ్." అం. 1

ఇట కైలాసనాథుని (కుబేరుని) ఉపసరించి మరలినదనఁగా నేమి? ఉపసరించుట యననేమి? ఏమిచేసినది? ఏమికోరి యుపసరించినది? మదనక్రీడకై యాశ్రయించినదా? "ఉపసృత్య" అనుపాఠము తృప్తికరముగా నుండలేదు. ఇది "ఉపనృత్య" అని యుండె నని చిరకాలము నేను తలంచియుంటిని. అనంతరము "ఉపనృత్య" అను పాఠమే ఒకగ్రంథాక్షరపుస్తకమందు దొరకినది. కుబేరునిమ్రోల నృత్యసేవ చేసి యని యర్థ మగును. నృత్యముచే బడలినట్టిది సురతమృదితవోలె కేశిదానవునికి మిక్కుటముగా మనస్సును ఊరించిన దనియు సూత్రపడును.

## VI. ఉత్తరరామచరిత—పతనవిరళైః.

ప్రతనువిరళైః ప్రాన్తోన్మీలన్మనోహరకున్తలై
ర్దశనముకుళై ర్ముగ్ధాలోకం శిశు ర్దధతీ ముఖమ్
లలితలలితై ర్జ్యోత్స్నాప్రాయై రకృత్రిమవిభ్రమై
రకృత మధురై రమ్బానాం మే కుతూహల మఙ్గకైః. 1 (20)

ఇది దశరథులవారు జీవించియున్నప్పుడు సీత యున్నతీరును చిత్రదర్శనమునఁ రాములవారు వర్ణించుట. ఆధునికులు కొందఱు "పతనవిరళైః" అని యారంభించి, కొన్ని పండ్లు ఊడిపోయి నోఁప తొఱ్ఱులైన దని యర్థము చెప్పినారు. మఱియు "ప్రాన్తోన్మీలన్మనోహరకుట్మలైః దశనకుసుమైః" అనియు పఠించి తొఱ్ఱులలో వెండియు పండ్లు మొలకెత్తుచున్న వని అర్థము చెప్పినారు. అంత లేఁబ్రాయముగా భవభూతి వర్ణించి యుండునా అని సందేహము. ఏలన—వివాహానంతరము ఇంకను మిథిలలోనే యుండఁగా జా[illegible] పైకొనినప్పుడు శ్రీరాముఁడు మహావీరచరిత్రలో సీతను వెలుపు దెచ్చి లోనికిం బంపెడువాక్యమున ఆమెకు "ఉన్నద్ధస్తన కుట్మలములను" "త్రివళీతరంగములను" చెప్పినాఁడు.

రామః—ప్రియే స్వస్థా సతీ నివర్తస్వ.

ఆతఙ్క శ్రమసాహసవ్యతికరోత్కమ్పః క్షణం సహ్యతా
మఙ్గై ర్ముగ్ధమధూకపుష్పరుచిభి ర్లావణ్యసారై రయమ్,
ఉన్నద్ధస్తనకుమ్భ (యుగ) కుట్మలభార (గురు) శ్వాసావభుగ్నస్య తే
మధ్యస్య త్రివళీతరఙ్గజుషో భఙ్గః ప్రియే మా చ భూత్.

దీనింబట్టి చూడ "పతనవిరళైః" అనుపాఠము తృప్తికరముగా నుండలేదు. ఇటుం బ్రథమోపాత్త మయినపాఠము సమంజసముగా నున్నది. పలువరుసంగూర్చి

"కున్ద కుట్మలనిభా స్సమా ద్విజా
యోషితాం పతిసుఖామితార్థదాః." బృహత్సం.

"స్థూలాః కరాళా విషమా శ్చ దన్తాః
క్లేశాయ చౌర్యాయ చ కృష్ణమాంసాః."

"స్నిగ్ధాః సమానరూపాః సుపఙ్క్తయః శిఖరిణోఽశ్లిష్టాః
దన్తా భవన్తి యాసాం తాసాం పాదే జగత్సర్వమ్.
తామ్బూలరసరక్తేఽపి స్ఫుటభాస స్సమోదయాః
దన్తా శ్శిఖరిణో యస్యా శ్చిరం జీవతి తత్పతిః."

అని మేఘవ్యాఖ్యలో మల్లినాథోద్ధృతము. దీని ననుసంధించినచో—"స్థూలాః" అనుటకు విపరీతముగా "ప్రతను" అనుటయు, "అశ్లిష్టాః" అనుటకు అనుగుణముగా "విరళ" అనుటయు, "శిఖరిణః" అన్నందులకు "ముకుళ" అనుటయు, స్ఫురించును. "ప్రాన్తోన్మీలన్మనోహరకున్తలమ్" అనునది ముఖమునకు విశేషణ మగును, కున్తలవర్ణనయుం గలుగును.—"కున్తలైః" అనుపాఠమున దళన - కుసుమములో ముకుళములో-వానిప్రక్కలను వెండ్రుకలు మొలచుచుండిన కని ఖండితవాదమును.

## VII. మాళవికాగ్నిమిత్రము.

### ౧. "మౌర్యసచివమ్"

మౌర్యసచివం విముఞ్చతి । యది పూజ్య స్సంయతం మమ స్యాలమ్
మోక్తా మాధవసేనం । తతోఽహ మపి బన్ధనా త్సద్యః. 1 (7)

తమ ఖయిదిగానున్న నామఱఁదిని మౌర్యసచివుని తమరు విడిచెదరేని, వెంటనే నేనును మాధవసేనుని ఖయిదునుండి విడిచెదను:—అని శ్లోకార్థము.

ఇట మౌర్యసచివపదమునకు అర్థమేమి? "మౌర్యనామానం సచివమ్" అనఁగా "మౌర్యుఁడను పేరి సచివుని" అని కాటయవేమటీక.

అప్పాశర్మగారు "ఆర్యసచివమ్" అని పఠించి, "ఆర్యం శ్రేష్ఠం సచివ మమాత్యమ్" అని టీక వ్రాసి, "అత్ర మౌర్యసచివ మితి పాఠే మౌర్యనామానం సచివ మితి కాటయవేమః" అని తనపై భారము వైచికొనక ముగించినారు.

శ్రీనివాసాచార్యవ్యాఖ్య—"మౌర్యసచివం మురాయా నామ శూద్రాయా స్తనయం పత్న్యాః పారశవ భ్రాతర మి త్యర్థః" అని.

ఇం దేదియు సరికా దని వక్ష్యమాణముచే తెల్ల మగును. శంకర పాండురంగ పండితులు మాళవికాగ్నిమిత్రోపోద్ఘాతములో నిట్లు వ్రాసియున్నారు:—

"The Puranas mention Pushpamitra as the founder of the Sunga dynasty,......he dispossessed his master Brihadratha, the last of the Mourya dynasty of his crown, and usurped it, ..... probably, as Professor Wilson supposes, in favour of his son."

కావున "మౌర్యస్య సచివమ్" అని టీకచేయుట సరి.

ఈకథను భాగవతపురాణమునను విష్ణుపురాణమునను అన్వేషింపుఁడు. (చంద్రగుప్తునికి మురాపుత్రుఁ డగుటచే మౌర్యుఁ డని నామాంతరము. ఆతనివంశమువారును ఆతనినామమునుం దాల్చిరి. ఇట ప్రస్తుతుఁ డయినమౌర్యుఁడు చంద్రగుప్తుని వంశమునం

గడపటిరాజు బృహద్రథుఁ డనువాఁడు; అతనిరాజ్యమును అగ్నిమిత్రునితండ్రి పుష్పమిత్రుఁడు సేనాపతిగా నుండి హరించి, అతనిమంత్రిని (అతఁడే ఇట విదర్భనిమఱఁది) చెఱ నుంచినాఁడు.—అని చరిత్రము ననుసంధింపవలయును.

## ౨. మధ్యమస్వర X షడ్జమస్వర.

ఇది యొక వింత పిల్లిమంత్రము.

జీమూతస్తనితవిశఙ్కిభిర్మయూరై
రుద్గ్రీవై రనురసితస్య పుష్కరస్య
నిర్హ్రాదిన్యుపచితమధ్యమస్వరోత్థా
మాయూరీ మదయతి మార్జనా మనాంసి. 1 (21)

ఈగ్రంథము (మాళవికాగ్నిమిత్రము), ఎఫ్. ఏ. పరీక్షకు పఠనీయముగా నున్నప్పుడు సంగీతప్రవిష్టు లొకానొకరు - ఇట 'మధ్యమ'స్వర మనుట పొరఁబాటనియు 'షడ్జమ' అని పఠింపవలయు ననియు, వాదించి, అట్లని పత్త్రికలు ముద్రింపించి, కాలేజపండితుల కందఱకును ఉత్తరము చెప్పుఁ డనియు, ఒండె మాయూసిత పాఠమునే శిష్యులకు నేర్పుఁడనియు - హెచ్చరిక చేసిరి. 'షడ్జమ' అనుశబ్దస్వరూపమే ఈవివక్షితార్థమున సిద్ధింప దని వారిని సమాధాన పఱుపవలసి వచ్చినది. అట్లును చక్కఁగా సమాధానపడక "షష్ఠమ" అని యుండ లేదా, వారప్రయోగించినారే? అని యాక్షేపించిరి. 'అదియును లేదు, వారి యాప్రయోగము ప్రామాదికము' అని చెప్పి తప్పించుకోవలసి వచ్చినది.

## 3. ఋజ్వాయతార్ధమ్.

వామం సన్ధిస్తిమితవలయం న్యస్య హస్తం నితమ్బే
కృత్వా శ్యామావిటపసదృశం స్రస్తముక్తం ద్వితీయం
పాదాఙ్గుష్ఠాలులితకుసుమే కుట్టిమే పాతితాక్షం
నృత్తా దస్యాః స్థిత మతితరాం కాన్త మృజ్వాయతార్ధమ్. 2 (6)

ఋజ్వాయతార్ధమ్—అనఁగా 'తిన్నని నిలువుసగము గలది-దేహమందు నిలువుగా ఒకపార్శ్వము (ఒకసగము) వంపులు గలిగియుండఁగా రెండవపార్శ్వము (రెండవసగము) వంపు లేక తిన్నఁగా నున్న' దని యర్థము. ఇది ఆమాళవిక నృత్తాంతమందు అలసి నిలుచుండిన తీరు. ఇందుపై టీకలు విభిన్నాభిప్రాయములుగా నున్నవి. ఇంగ్లీషు జ్ఞాపిక—"ఆయతార్ధ seems here to be applied to the trunk of the body from the neck to the waist."—"ఋజు సరళ మాయతం చ

అర్ధ ముపరితనః శరీరార్ధభాగః" అప్పాశర్మ; ఈ టీకలో 'ఆయత' మునకు వివరణములేదు. "ఋజు అవక్రమ్ మర్ధం శరీర స్యార్ధభాగో యస్మిన్ తత్" అని కాటయ వేమీయము. ఇందును 'ఆయత'ము గిళితము.—ఇట సరియైన టీక శ్రీనివాసీయము. అందలి యుద్ధృతమున నించుక యిం దుదాహరించెద.—

"వామ స్తాలాన్తర స్త్ర్యస్రో దక్షిణ శ్చరణః సమః
ప్రసన్నం వదనం వక్షః సమున్నత మనున్నతా
కటీ నితమ్బయో ర్హస్తో దక్షిణో౽న్యో లతాకరః
య త్రా౽యతం తదాఖ్యాతం కమలా చాత్ర దేవతా
స్థానం చికీర్షితాసు స్యాత్ కృతాసు చ గతి ష్విదమ్."
[లతాకరః - కృత్వా శ్యామావిటప సదృశం స్రస్తముక్తం ద్వితీయమ్]

ఇంకను సంశయాపనోదక మగు విస్తరమును ఆటీకయందే గనవచ్చును. సంవాద వినోదార్థమై కమలినీకలహంసికయందలి యీతాళావసానస్థితవర్ణనముం గనుఁడు.—

"ఏకాం బాహులతాం మృదు ద్విగుణితాం కృత్వా వలగ్నాశ్రయాం
చేటీహస్త సమర్పితేతరభుజం కేయూరసన్దిత్సయా।
అంసాలమ్బితకేశపాశ మసకృన్నిశ్వాసకమ్ప్రస్తనం
తన్వఙ్గ్యా స్స్వదతే౽ధునాపి త దిదం తాళావసానస్థితమ్."

## ర. "ప్రథమామివ"

"చరణాన్త నివేశితాం ప్రియాయాః। సరసాం పశ్య వయస్య రాగలేఖామ్
ప్రథమామివ పల్లవ ప్రసూతిం। హరదగ్ధస్య మనోభవద్రుమస్య." 3 (11)

"ప్రథమా మాద్యాం పల్లవప్రసూతిం కిసలయోత్పత్తి మి వే త్యుత్ప్రేక్షా" అని అప్పాశర్మటీక. ఇందు ప్రథమాశబ్దస్వారస్యము వివృతము గాదు. "ప్రథమపల్లవస్య రాగాతిశయాదుపమానత్వమ్" అని శ్రీనివాసటీక. ఇందును ప్రథమశబ్దమును ప్రసూతికి విశేషణముగాఁ బ్రయోగించిన స్వారస్యము వివృతము గాదు. "ప్రసూతిం ప్రథమామ్" అనుటచే మనోభవుఁడు దగ్ధుఁడైననాఁటినుండి నేఁటివఱకు మదనోద్దీపనమే లేదు, ఇదే, మొదటిది, అని యర్థమగును. దానిచేత నాఁటినుండి నేఁటివఱకు గలిగినమదనోద్దీపనములు దీని (ఈమదనోద్దీపనము) ముందఱ సున్నతో సమానము. అని భావ మగును. అనఁగా నాఁటినుండి నేఁటివఱకు ఇంత మనోహరమయిన (సుందరమైన) చరణాంతరాగలేఖ లేదాయెను, ఇదియే మనోహరతమము, అనుట.

[శాకుంతలములోఁ గూడ కొన్నిట స్వారస్యమును వ్యాఖ్యాతలు వదలిరి.

ఒకటి—

"క్షౌమం కేనచి దిన్దుపాణ్డు తరుణా మాఙ్గల్య మావిష్కృతం
నిష్ఠ్యూత శ్చరణోపభోగసులభో లాక్షారసః కేనచిత్
అన్యేభ్యో వనదేవతాకరతలై రాపర్వభాగోత్థితై
ర్దత్తా న్యాభరణాని తత్కిసలయోద్భేద ప్రతిద్వన్ద్విభిః." 4 (4)

ఇందు ఉద్భేదశబ్దస్వారస్యము తేటపడవలయు—

"తేషాం వృక్షాణాం యే కిసలయోద్భేదా స్తేషాం ప్రతిద్వన్ద్విభిః ప్రతిపక్షైః స్సదృశై రితి యావత్." శ్రీనివాసవ్యాఖ్య.

"కిసలయోద్భేదా ఉద్భిద్యమానపల్లవాః, లక్షణయా రక్తతరత్వకోమలత్వాది వ్యఙ్గ్యమ్, తత్ప్రతిద్వన్ద్విభి స్తత్ప్రతిస్పర్ధిభిః తాదృశై రితి యావత్." రాఘ.

"కిసలయానాం నవపల్లవానా ముద్భేదా వికాసాః ఉద్భిన్నాని కిసలయాని ఇత్యర్థః తేషాం ప్రతిద్వన్ద్విభిః తత్సదృశైః." రాయటీక.

ఎందును ఉద్భేదశబ్దస్వారస్యము రాలేదు. — కరతలము చెట్టుఁగొమ్మలనుండి పొటమరించుట (పొడుచుడెంచుట) మాకంటి కగపడెను, అది మాకనులయెదుటనే చిగురుటాకే మొలతెంచుచున్నదో యని మేము ఆశ్చర్యపడుచుం జూచుచున్నట్లుండెను, అని స్వారస్యము.

రెండవది :—

౬. "మ య్యేవ విస్మరణదారుణచిత్తవృత్తౌ
వృత్తం రహః ప్రణయ మప్రతిపద్యమానే
భేదా ద్భ్రువోః కుటిలయో రతిలోహితాక్ష్యా
భగ్నం శరాసన మి వాతిరుషా స్మరస్య."

స్మరశరాసనభంజనము చెప్పుటచే తద్వైయర్థ్యము నిబద్ధము. ఈశరాసనము దేనిని పుట్టించినదో దుష్యంతుని యాయనురక్తియే కృత్రిమ మైనపిమ్మట, ఇఁక లోకములో వాస్తవానురక్తిని ఇది పుట్టింపఁగలుగునా ? కలుగదు గాన ఇది యుండఁదగినది కాదు;—అని భావము. దీనిని వ్యాఖ్యాతలు తడవలేదు.]

## ౭. తుల్యానురాగము.

"అనాతురోత్కణ్ఠితయోః ప్రసిధ్యతా । సమాగమే నాపి రతి ర్న మాం ప్రతి
పరస్పరప్రాప్తినిరాశయో ర్వరం । శరీరనాశోఽపి సమానురాగయోః. 3 (15)

మహాకవులు శృంగార రసోల్బణార్థమై నాయికానాయకులయందు అన్యోన్య తుల్యానురాగమును సాధింతురు. రసజ్ఞు లగు నాయికానాయకులును పరస్పరము

దానినే కోరుదురు. పరస్పరప్రాప్తినిరాశుల శరీరనాశమును మననాటకశాస్త్రమర్యాదను కట్టుఁబడి కాళిదాసుఁడు ఊహామాత్రగోచరము చేసికొనెనేగాని ఇతివృత్తముగా నెచటనుంగొనలేదు. ఈమర్యాదను గణింపనివాఁడు హూణమహాకవి షేక్స్పియరు దానినే "రోమియో అండు జూలియెట్టు" లో ఇతివృత్తముగానే చేసినాఁడు. శరీరనాశముకన్న వలపునకు తార్కాణ మొండు గలదా? రసికాగ్రేసరచక్రవర్తుల మార్గములు ఇట్టివి. కిరణావళిలో ధ్వనకుఁడు షేక్స్పియరువలెనే కథావస్తువును విషాదాంతముగా సాధించె నని పెద్దలు చెప్పుదురు. ఆగ్రంథము ఇంకను అలవడలేదు. కడపట మనకవులతుల్యానురాగ వర్ణనమునకు ఇంచుక యుదాహరణము :—

(1) శాకుంతలమున—

కామం ప్రియా న సులభా । మన స్తు తద్భావదర్శనాశ్వాసి
అకృతార్థేఽపి మనసిజే । రతి ముభయప్రార్థనా కురుతే. 2 (1)

దీనికి సంవాదమే "అనాతురే" త్యాది ప్రకృతమాళవికాశ్లోకము.

(2) విక్రమోర్వశియందు—

తుల్యానురాగపిశునం లలితార్థబన్ధం
పత్త్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః
ఉత్పక్ష్మణా మమ సఖే మదిరేక్షణేన
తస్యాః సమాగత మి వానన మాననేన. 2 (14)

ఇది ఊర్వశి వ్రాసిన మదనలేఖముం జదివి పురూరవుఁడు సంతసించుట.

(3) విద్ధసాలభంజికయందు—

రాజా—(విదూషకం హస్తే గృహీ త్వోపసృత్య సానురాగప్రశ్రయమ్)
యస్య కృతే వహతి జనో । మృదితమృణాలోపమాని గాత్రాణి
తస్య కృతే యది సోఽపిహి । త దఖణ్డశరాసనో మదనః. 3 (26)

(4) మల్లికామారుతమందు—మారుతః.—

కువలయదృశోఽ ప్యేవం చేతో వి శే ద్యది మన్మథో
నియత మియతా పూర్ణాః కామా వినాఽపిచ సంగమమ్,
సరసి నళినీ, వ్యోమ్ని బ్రధ్న ; స్తథాఽపి పరస్పర
ప్రభవసరసే భావే ఖ్యాతే తయో ర్మిథునప్రథా. 3 అం.

(5) కమలినీ కలహంసికయందు:—

కాన్తాస్వహ స్తలిఖితం సదృశానురాగ
కర్ణేజపం సరసబన్ధ మిమం నిశమ్య

సౌధాకరై రివ కరై రభిషిచ్యమానం
చేతోఽధునా కి మపి నిర్వృతి మభ్యుపైతి! ౭౦.

## ౮. భిద్యమాన

"అగ్రే వికీర్ణకురవక । ఫలజాలకభిద్యమానసహకారమ్
పరిణామాభిముఖ మృతో । రత్సుకయతి యౌవనం చేతః." 5 (4)

ఇందులకు తెలుఁగున నొక యనువాదము:—

గీ. వంగి కురవక ఫలజాల భారమునను
చూతభూరుహ మల్లదె చూడు మెదుట
రహిని నీబుతు యౌవనారంభ మనఁగ
మదికి నుత్కంఠ గొలిపెడు మఱియు మఱియు.

ఇందు గోరంట కాయలబరువుచే మామిడిచెట్టు వంగిపోవుట యను విపరీతము కనవట్టుచున్నది. లేదా, 'వంగిచూడుము' అని యన్వయమో ?

ఇట వాక్యలు నానాప్రకారములుగా నున్నవి:—

"ఫలజాలక భిద్యమాన" అని వాచస్పతిపాఠము. "కురవకాణాం ఫలసమూహైర్భిద్యమానోఽవలమ్బ్యమానః సహకారో యత్ర" అని తదీయ టీక.

"కురవకాణాం ఫలజాలకేన ఫలసమూహేన భిద్యమానాని విదీర్యమాణాని సహకారాణి ఆమ్రఫలాని యత్ర తథాభూతమ్" అని అప్పాశర్మ టీక. ఇందు గోరంటకాయలచే మామిడికాయలు బ్రద్దలగు ననునసంభావ్యము ఉక్తము.

"ఫలజాల విభుజ్యమాన" అని యొక పాఠము. ఈపాఠమును పఠించినవారు "అగ్రేవికీర్ణ కురవక" అను భాగమును ప్రత్యేకముగా యౌవనమునకు విశేషణముగాను, కురవకం చ తత్...సహకారం చ అని ఆదీర్ఘసమాసమును విశేషణోభయపదకర్మధారయముగాను, గ్రహింతురు. ఆ యన్వయమున ఎదుట గోరంటకాయలు రాలియున్నవనియు, మామిడిచెట్టు తనకాయలబరువుచే వంగిన దనియు నర్థము.

ఈయర్థమే కొంత వచ్చునట్టు శ్రీనివాస పాఠాదిక మిట్లున్నది.—

"అగ్రే వికీర్ణకురవం । ఫలజాలక భజ్యమానసహకారమ్"

"...కురవాణి కురవక కుసుమాని యస్మిన్ తత్...భజ్యమానాః ప్రాప్యమాణాః—భిద్యమా నేతి పాఠే భిద్యమానాః సంగచ్ఛమానాః......" ఈ టీకయందు భజ్యమాన=భిద్యమాన=పొందఁబడుచున్న-అని యర్థము చెప్పఁబడినది.

కవిహృదయము ఈక్రిందియట్లుండనోపు.—"అగ్రే=ఇదిగో మొ్రలను, వికీర్ణ=చల్లఁబడిన (రాలిపడియున్న) - కురవక ఫలజాల=గోరంటకాయల సమూహమునుండి-విభిద్యమాన = వేఱుపఱుచున్న - సహకారమ్ = మామిడికాయలు గలది - అని యౌవనమునకు విశేషణము. ఇంతవఱకు గోరంటకాయలు ఎంతచిన్నగా మామిడి కసుఁబిందెలును అంతచిన్నవిగా నుండినవి. అప్పుడు, ఇవి గోరంటకాయలు-ఇవి మామిడి కసుఁబూపలు - అను భేదము తెలియకుండెనది. గోరంటకాయలు ఎంత ముదిరినను మిరియాలకన్నం బెద్దవి కానందునను, మావిపూపలు క్రమముగా అంతకన్న పెద్దవిగా ఎదుగుటచేతను, ఇప్పుడు-ఇవి గోరంటకాయలు, ఇవి మామిడికసుఁవెలు, అని వానిభేదము ఎఱుకవడుచున్నది.

౯. గతహిమైః.

"అనతిలమ్బిదుకూలనివాసినీ । లఘుభి రాభరణైః ప్రతిభాతి మే
ఉడుగణై రుదయోన్ముఖచన్ద్రికా । గతహిమై రివ చైత్రవిభావరీ." ౫ (౯)

'గతహిమైః' - 'హతహిమైః' అని పా. 'లఘుభిః' — 'బహుభిః' అని పా. 'అనతి లమ్బ' పా.—ఇఁక టీకలు.—

శ్రీనివాసటీకనుండి.—"అనతిలమ్బం నాత్యర్థం లమ్బమానం అల్పలమ్బ......దన మిత్యర్థః...లఘుభి ర్మనోజ్ఞైః ఆభరణైః స్వల్పైః ఉదయోన్ముఖీ ఉదయాభి-సక్తా చన్ద్రికా యస్యాస్సా-అధస్తా దుద్యత్ప్ర ప్రసృతచన్ద్రి కేత్యర్థః ...ఆభర ణానా మతిశోభానార్థం దుకూల స్యానతిలమ్బత్వం ప్రసిద్ధం వివాహవేషత్వాత్. చన్ద్రికాయా శ్చానతిప్రసరే తారకాణా మౌజ్జ్వల్య మితి సాదృశ్యమ్."

అప్పాశర్మ.—"...బహుభి రాభరణై రలఙ్కారైః...ఉదయోన్ముఖీ చన్ద్రికా-ఉదయోన్ముఖీ ఆసన్నోదయా చన్ద్రికా యత్ర తథాభూతా చైత్ర విభావరీ...హత హిమైః హత మపసారితం హిమం కాన్తిప్రతిబన్ధకం నీహారం యేషాం తైః ఉడుగణై ర్నక్షత్రసమూహై రివ। బిమ్బప్రతిబిమ్బభావోపన్యస్త సాధారణధర్మోపమాలఙ్కారః, ఉత్ప్రేక్షేతి తు భ్రాన్తిః."

వాచస్పతి.—"అనతిలమ్బిదుకూలనివాసినీ పరిహితానతిదీర్ఘవసనా ఇయం మాళవికా లఘుభి రల్పై రాభరణైః ఉదయోన్ముఖీ చన్ద్రికా యత్ర తాదృశీ, అనేన శుక్లపక్షః సూచితః...హతహిమై రపసారితదీప్తిప్రతిరోధకతుషారైః ఉడుగణై రివ మే ప్రతిభాతి। ఆభరణానా ముడుగణేన సాదృశ్యమూహ్యం మాళవికాయాః విభావరీ రూపేణోత్ప్రేక్షేతి భావః."

ఒక యాంధ్రానువాదము.—

గీ. "చాల (వ్రేలనిపట్టువస్త్రంబు గట్టి
మితవిభూషణములతోడ మెఱయు నీమె
హిమము గ్రమ్మని నక్షత్రసమితితోడఁ
బ్రబలచంద్రిక గలచైత్రరాత్రిఁబోలి." సీ. ౭౦.

టీకలలో లేని యొక విశేషము ఇందుఁ బ్రబలచంద్రిక. చంద్రోదయమే కాలే దని మూలము.

ఇట్లు ఈశ్లోకము సందేహమయ మయినది. దీనిం దాఁకిన యిందఱిలో నొకరే నియు "చైత్రో" క్తియందలి కవిహృదయ మేమో ఊహింపరైరి. ఇట కథావస్తు వేమన.—పట్టమహిషి ధారిణి పుష్పిత తపనీయాశోక దర్శ నోత్సవమున సత్కార వ్యాజమున అగ్నిమిత్రునికి మాళవికను ఇచ్చి అబ్బురపెట్టం దలపెట్టియున్నది. అందు నిమిత్తమై మాళవికను యథోచితనేపథ్యను తనపరిజనములో తనతోఁగూడ కొని వచ్చినది. మఱి యిట శ్లోకవస్తు వే మనఁగా.—మాళవిక దుకూలమును అడుగులు దిగునట్లు గానే అయినను నేలను జీరాడకుండునట్లు కట్టుకొన్నది. ఈదుకూలములు రెండు — కట్టుచీరయు పైటయు నని. కాదంబర్యాదులు కన్యలే దుకూలయుగళ మును ధరించియుండి రని ఆకరములయందున్నది. వక్ష్యమాణ కుమారసంభవ శ్లోక ప్రస్తావముం గనుఁడు. ఇది వివాహనేపథ్యమును అగును, సామాన్యమును అగును అబ్బురపెట్టుటకై ప్రయత్నముగాన వివాహనేపథ్యమే యని తెలియనీయఁగూడదు. ఆభరణములు కొంచెమే దాల్చియున్నది. ఎక్కువగా నుండినయెడల ఆవైలక్షణ్య ముచే వివాహప్రయత్నముగా రాజు ఊహించుకొను నని అతనిని వంచించుటకై పట్టపుదేవి మాళవికకు తొడవులను కొంచెముగానే తొడిగించినది. పైగా విరళా లంకారతచే సహజసౌందర్యమే స్ఫుటపడును. ఆ లఘ్వాభరణములును పైఁదుకూ లములోపల మిణుకుమిణుకుమనుచున్నవి. అట్టియాతీరున మాళవిక దేనిం బోలి యుండె ననఁగా:—చంద్రుఁడు పొడతేరనుండఁగా తూర్పు తెల్లవాఱును. ఆ తెలు పును పెద్దనగారు—

క. "అంతటఁ బ్రాచి నిశాపతి। యంతికగతుఁ డౌట విని ముఖాలంబి తమః
కుంతలములు దీర్పఁగఁ గొను। దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్."

అని దంతపుదువ్వెనతోఁ బోల్చినారు. అట్లు చైత్రమాసరాత్రిలో మింటియధో భాగము తెలుఁగుగావత్తు నాకారమున ధవళిమ దువాళించుచుండఁగా, ఊర్ధ్వభాగ మున అల్పంతి నక్షత్రములు ఈచంద్రికోదయమునకే వెలిడా లాలయునుసుమంచులో

పల తళుకుతళుకుమనుచుండఁగా, చంద్రోదయ మాసన్నమైయున్న ప్రాచీభాగము ఇచట ఉపమానార్థము కవిచేత భావింపఁబడినది. ఆచొప్పున అధోదుకూలము ఆసన్న చంద్రోదయ మగు తూర్పునందలి ధవళిమవలెను, లఘ్వాభరణములు మింటిలోని లఘు నక్షత్రగణములవలెను, వానిని మఱఁగించియు మఱుంగింపని పైతాదుకూలము వానిని క్రమ్మియుఁ గ్రమ్మని నునుమంచువలెను, అట్టి నాయిక అట్టి చైత్రవిభావరివలెను, ఉండె నని విరివి.

మఱి చైత్రమాసమును చెప్పిన స్వారస్య మే మనఁగా :—దానిం జెప్పుట జిలుఁగుమంచుకొఱకు. చైత్రానంతరము మంచే ఉండదు; చైత్రమునకు పూర్వము దట్టమంచు ఉండును. దట్టమంచు నక్షత్రములను దట్టముగా క్రమ్మివైచును, కావున అది యిటం బనికిరాదు. కావున అట్టి శిశిరాదిరాత్రి గాక, మంచే లేని వైశాఖాదిరాత్రి యుఁ గాక, వలిపదుకూలము ఆభరణములనుబోలె నక్షత్రగణములను క్రమ్మియు క్రమ్మకుండుటకు వలసినంతమంచే గల దగు చైత్రరాత్రి కవికులగురువుచే పేర్కొనంబడినది. మఱి గణ మేమి యనఁగా—ఒక్కొక్క రత్నాభరణము ఒక్కొక్కనక్షత్రగణమువంటి దనియు, దానిలోని యొక్కొక్కరత్నంబును ఒక్కొక్కనక్షత్రము వంటి దనియు, భావము. కావున 'హతహిమైః' అను పాఠము సరిగాదు. 'గతహిమైః' అనఁగా 'ప్రాప్తహిమైః=మంచును బొందినట్టి' అని యర్థము చెప్పవలయును. ఆభరణములు లఘువులుగాన, తదుపమానమైన నక్షత్రగణములును లఘువులుగా నుండుట సముచితము; అందులకై వెన్నెలరాత్రి చెప్పఁబడినది. తూర్పుధవళిమ వెన్నెలయే.

“భూయస్తరాణి య దమూని తమస్వినీషు
జ్యోత్స్నీషు చ ప్రవిరళాని తతః ప్రతీమః
సంధ్యానలేన భృశ మప్సరమూషికాయా
మావర్తితై రుడుభి రేవ కృతోఽయ మిన్దుః.”

“ఉదయోన్ముఖచన్ద్రికా” — ఇట వెన్నెల యుదయింపనే లే దని యర్థము స్ఫురించును. ఆపక్షమున అధోదుకూలమునకు తూర్పుధవళిమ యనునుపమాన ముండదు. వెన్నెల బొత్తిగా లేనిచో మింటివలిపమంచు ప్రకాశింపదుగాన పైతాదుకూలమునకును ఉపమాన ముండదు. ఈతీరున అవయవభంగముచే అవయవిభంగము కాఁగా ఉపమయే క్షయ మొందును. కావున 'ఉదయమందు పైకి ప్రసరించుచున్న చంద్రిక కలది' అని యన్వయించుట యుచితము. దాన, చంద్రుఁడు ఉదయింపనున్నాఁడనియు, తద్ధవళిమ పైకి కొంతదూరము తూర్పున మింటి కెక్కియున్న దనియు లభించును. తొలుత 'హిమగతైః' అని యుండి ఎవరేని హిమనష్టినే యిట భావించినవారు ఇట్లు మార్చిరో యనియు శంకింపఁదగియున్నది. గత=అధిగత.

చైత్రమున మంచు నిశ్శేషము గాదని కవికులగురువే చెప్పియున్నాఁడు. రఘువులో వసంత వర్ణనలో—

"వ్రణగురుప్రమదాధరదుస్సహం । జఘననిర్విషయీకృత మేఖలం
నఖలు తావ దశేష మపోహితుం।రవి రలం విరళం కృతవాన్ హిమమ్."

"ఏవంభూతం హిమం (తుహినం) రవి స్తావ దావసన్తా దశేషం నిశ్శేషం యథా తథాఽపోహితుం నిరసితుం నాలం ఖలు న శక్తో హి...కిం తు విరళం కృతవాన్ తనూచకార."

ఋతు సంహారము—

"ఈషత్తుషారైః కృతశీతహర్మ్యైః । సువాసితం చారు శిరః సుచమ్పకైః
కుర్వన్తి నార్యోఽపి వసన్తకాలే। స్తనా సహారా కుసుమై ర్మనోహరైః."

మల్లినాథసూరి టీకలో చెప్పిన తుహినతానవమునే వాగ్భటకవి నేమినిర్వాణ కావ్యమందు వసంతవర్ణనలో ప్రస్తావించుచున్నాఁడు:—

"తుహినతానవ మాతపతీవ్రతాం । విదధతః సుతరాం మధువాసరాః
విరహిణా మతిదుస్సహతాం గతాః।సుగురవో గురవోఽపచయం క్షపాః."

"అనతిలమ్బి" - ఎక్కువగా వేలకు వ్రేలనియట్లుగా అని క్రియావిశేషణముగా గ్రహించుట సొంపు. ఈ వర్ణన మదీయమగు నుషానాటకములోని యీపద్యమునకు అనుగ్రాహక మని తలంచెద:—

"మృషావలగ్న జిల్గుపైఁట మించుసన్నమం చగున్,
ఝషాక్షిదట్ట మన్న సంజజాజులోని రే కగున్,
తృషాకృదోష్ఠిభూషణాళి రిక్కలు న్మెఱుంగులౌ,
నుషావతార మంచుఁ గాంత నూహసేయుదు న్సఖా."

"అనతిలమ్బి" శ్లోకమునకు మదీయాంధ్రానువాదము:—

"అనతిలంబి దుకూలవాసిని శుభాంగి
యలఁతితోడవులె ధరియించి హావణుమించు
విరళతుహినత నక్షత్రవితతు లొప్ప
శశి పొడువ నున్నమధుమాసనిశయుఁ బోలె."

## VIII. రత్నావళి.

### లావణకేన

వసుభూతిః—"తతో లావణకేన వహ్నినా దేవీ దగ్ధేతి వార్తా ముత్పాద్య నేవేన తదన్తికం బాభ్రవ్యః ప్రహితః."

ఇందులకు ఆంధ్రానువాదము: "అప్పుడు లావణకమున దేవి కాలిపోయిన దని ప్రవాదము కలిగించి యాతని సమ్ముఖమునకు బాభ్రవ్యుని పంపినాఁడను." వీ. ౪౦.

వ్యాఖ్య.—"లావణకేన ఇతి లవణేన సైన్ధవలవణాది ప్రధాన రస గన్ధాదినా కృత చూర్ణవిశేషో లావణకః యద్యుక్తే నలకాదౌ వహ్నిసంయోగేన ధ్వని రుత్పద్యతే । తత్సంబన్ధినా తేన జాతేన వాఽగ్నినే త్యర్థః. లావణక ఇత్యత్ర సంజ్ఞాయా మి త్యనేన వుఞ్."

తుపాకిమందునకు నిప్పంటుకోఁగా ఆమంటలో వాసవదత్త కాలిపోయిన దని యీటీకలోనిభావము. పై యాంధ్రానువాదములో లావణక పదము ప్రదేశవిశేష పరమేమో యనియు సంశయము వొడముచున్నది. ఇట "లావణకేన" అని వాస్తవ పాఠము గాదు. వాస్తవపాఠము "లావాణ" కేన అనునది. వాకు దీర్ఘము వలయును. ఎట్లన లావాణక మనునది మగధదేశమునకు సమీపమందు వత్సరాజునకు రెండవరాజధానిగ నుండెను. ఇట కథ యే మనఁగా "సింహళరాజుకూఁతును రత్నావళిని పెండ్లికాఁగలవాఁడు సకలభూమండలమును ఏలును" అని సిద్ధాదేశమును విని యౌగంధరాయణుఁడు ఆమె నెట్లయినను తనదొరకు సంపాదింపవలయు నని సింహళ రాజునకు రాయబారము పంపెను. ఆయన తనకు వాసవదత్త సమీపబంధు వగుట చే ఆమెకు సవతిగా తనకూఁతును ఇయ్య నంగీకరింపలేదు. అనంతరము యౌగంధ రాయణుఁడు లావాణకమునుండి రాజును వేఁటకు పోనిచ్చి వాసవదత్తను ఒకచోట సురక్షితనుగా ఉంచి లావాణకమందలిరాచనగరికి నిప్పు పెట్టించి అందులో వాసవ దత్త కాలిపోయిన దని ప్రవాద కల్పించెను. ఆప్రవాద మల్లుకొన్న తర్వాత సింహ ళాధిపుని యంగీకారముతో రత్నావళిని వత్సరాజుకై గ్రహించెను. వాను ప్రాస్వీకరిం చుట లవణమునుండి వ్యుత్పత్తి కల్పనకుం గారణమైనది. దీర్ఘమునకుం బ్రమాణము:—

> "ఏవం గతే స్వవృత్తాన్తే లావాణకగతై స్తదా ।
> గత్వా మగధరాజాయ చారై స్సర్వం నివేదితమ్."

ఈ కథ కథాసరిత్సాగరములో లావాణకలంబకములో 1 తరంగము 119-వ శ్లోకము మొదలుకొని యున్నది. ఈ యుదాహృత శ్లోకము అష్టమములోనిదే.

## IX. రసార్ణవసుధాకరము.

### ఏకాప్సరఃప్రార్థితయోః.

> "పరస్పరేణ క్షతయోః ప్రహర్త్రో । రుత్క్రాన్తవాయ్వో స్సమకాల మేవ
> అమర్త్యభావేఽపి కయో శ్చిదాసీ । దేకాప్సరఃప్రార్థితయో ర్వివాదః."

ఒకస్త్రీకి అనేకపురుషులయందు రాగాభాసమున కుదాహరణముగా దీనిని గ్రహించినారు. అపక్షమున "ఏకాప్సరః ప్రార్థితయోః" అన ఒకయచ్చరచేఁ గామింపఁబడిన యిరువురకు అని యర్థము. ఇచ్చట అచ్చర కామించెనఁట గదా. ఆవీరులు ఆయచ్చరను కామించిరా లేదా? ఇరువురు నచ్చరం గామించిన వివాదము వచ్చును; కామింపనిచో, వారికి వివాద మేల వచ్చును? వివాదముచే కామించి రనియే తెలియుచున్నది. ఈయిరువురలో నెవఁడు తనకు వల దన్నను జగడ ముండదు. ఇద్దఱు వలదన్న నైక్యమే గాని కయ్య ముండదు. కావున నిట వారిప్రార్థన కారణము గాని, దానిప్రార్థన కారణము గాదు. కావుననే మల్లినాథసూరి విశేషణమునకు పరనిపాతముగా ఆహితాగ్న్యాదులలోఁ జేర్చి "ప్రార్థితైకాప్సరసోః" అనఁగా ఒక్క-యచ్చరనే కోరినయిరువురుభటులకు అని యర్థము వ్రాసియున్నాఁడు. ఆవ్యాఖ్యకే కుమారసంభవములోని యీక్రిందివర్ణన చేయూఁత యిచ్చుచున్నది.

"అన్యోన్యం రథినౌ కౌచి ద్గతప్రాణౌ దివం గతౌ
ఏకా మప్సరసం ప్రాప్య యుయుధాతే వరాయుధౌ." 16 (48)

## X. రఘువంశవిమర్శము.

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వన్దే పార్వతీపరమేశ్వరౌ॥

ఈనడుమ రఘువంశ విమర్శమను పేర వెలువడిన గ్రంథములో విమర్శకులు 'వాగర్థావివ' యనుకావ్యాది మంగళ శ్లోకము శుష్క-వైదికోచితముగాను ఉత్తమకావ్యానుచితముగాను మహాకవ్యనర్హముగాను ఉన్నదనియు, దానంజేసి అది కాళిదాసీయము కాదనియు, ప్రక్షిప్తముగా నుండనోపు ననియు, దానిని కాళిదాస గ్రంథాదిగా కైకొనుట మల్లినాథుని పొరఁబాటనియు, ఆక్షేపించినారు.

ఈ శ్లోకమును కాళిదాసకృతముగా నమ్మి వివరించినవారిలో మల్లినాథసూరి 23-వ వాఁడు. ఈశ్లోకము ప్రాచీనమహావిద్వాంసులకు గణనీయముగా నుండెను.—

(1) శ్రీమదప్పయదీక్షితులవారి చిత్రమీమాంసయందు—

"తత్ర పూర్ణాయాం ధర్మ స్యానుగామితా యథా.—'వాగర్థావివ....'"

(2) రసగంగాధరమందు—

"యత్తు చిత్రమీమాంసాయాం 'వాగర్థా వివ సంపృక్తౌ' విత్యత్ర రసధ్వనిః..."

(3) హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనమునకుం దానే రచించిన వివేకాఖ్య టీకయందు కవనశిక్షా ప్రకరణములో—

"పురాతన వృత్తేషు పదపరావృత్త్యభ్యాసో యథా: 'వాగర్థా వివ...'

వాణ్యర్థావివ సంయుక్తౌ వాణ్యర్థ ప్రతిపత్తయే
జగతో జనకౌ వన్దే శర్వాణీ శశిశేఖరౌ.

ఏవం మహాకావ్యార్థచర్వణ పరకృత కావ్యపాఠాద్యాః శిక్షా అ భ్యూహ్యాః."

(4) భోజరాజకృత సరస్వతీకంఠాభరణమందు—

"యత్ర సంపూర్ణవాక్యత్వ మర్థవ్యక్తిం వదన్తి తామ్.
యథా:— 'వాగర్థా వివ....' అత్రవాక్యపరిపూర్ణతయాఽర్థ సమర్థకత్వా దర్థ వ్యక్తిః." (అర్థవ్యక్తి యనునది భోజోక్త కావ్యగుణము లేనింటిలో నొకటి.)

(5) వెండియు సరస్వతీకంఠాభరణమందు.—

"సమాసేఽపి ఇతరేతరయోగా దనుభయాశ్రితః సముచ్చయభేదో యథా.— 'వాగర్థా వివ...' అత్ర 'వాగర్థా వివ' ఇతి పరవల్లిఙ్గతా, 'సంపృక్తౌ పితరౌ' ఇతి అత్ర యోఽయం 'పుమాన్ స్త్రియా' 'పితా మాత్రా' ఇతి చ ఏకశేషః, తే నైష విశేష లక్షణయోగాత్ వక్రోక్తిత్వే సతి అలంకారతాం లభతే ఇతి న ధవఖదిరాదిషు అతిప్రసఙ్గః ఇతి అయ మపి సముచ్చయభేదః.

(6) ప్రసిద్ధ సమస్యలలో—

'వాగర్థావివ సంపృక్తౌ శతకోటి ప్రవిస్తరం
తురాసాహం పురోధాయ నేము స్సర్వే సురాః శివౌ.'

(7) శ్రీరామకృష్ణగోపాల భండారకారపండితునికి G. N. R. అనువారిచే అంకితము సేయఁబడిన బొంబాయిముద్రణ రఘువంశములో ప్రకృతశ్లోకముమీఁదివ్యాఖ్యలో నడుమనడుమ చారిత్రవర్ధన - సుమతి విజయ - విజయానందసూరిచరణసేవకుల వ్యాఖ్యలనుండి టీకాభాగములు ఉదాహరింపఁబడి యున్నవి.

సైవిస్తరమువలన ఈ శ్లోకము కడుం బ్రాచీన మనియు, దీనిని రాజమాషని భదంత శ్లోకశత్రు చ్ఛాందస ప్రణీత 'భోజనం దేహి రాజేన్ద్ర ఘృతసూపసమన్వితమ్' వంటి దానినిగాఁ గాక, కాళిదాసీయ 'మాహిషం చ శరచ్చన్ద్ర చన్ద్రికాధవళం దధి' వంటి దానినిగానే, ఈ యిండియాదేశమందలి రసిక విద్వ ద్విమర్శ కాలంకారిక శిరోమణులు గణించి రనియు, విశద మగుచున్నది.

(8) ఇది యెల్ల నిటుండ ఈ శ్లోకమందలి యుపమార్థము కాళిదాసునకు ఎంత ప్రియముగా నుండెనో, దీనిని కుమారసంభవ షష్ఠసర్గలో 79-వ శ్లోకములోఁ గూడ ప్రయోగించుకొనుటవలననే ఎఱుంగవచ్చును.

'త మర్థ మివ భారత్యా సుతయా యోక్తు మర్హసి,
అశ్లోచ్యా హి పితుః కన్యా సద్భర్తృ ప్రతిపాదితా.'

(9) ఇందుపై మల్లినాథవ్యాఖ్య.—'తమితి.—తం శమ్భుం, భారత్యా వాచా, అర్థ మభిధేయ, మివ, సుతయా దుహిత్రా, యోక్తుం సంఘటయితు మర్హసి; అత్ర వాగర్థయో రుపమానత్వ సామర్థ్యా చ్ఛివయో ర్నిత్యయోగో వివక్షిత ఇ త్యుక్తం 'వాగర్థా వివ సంపృక్తౌ' ఇ త్యత్రాపి..."

ఇందుపై చారిత్రవర్ధనటీకాభాగము.—'అర్థ మివ-ఏతేన వాగర్థయోః యథా నిత్యః సంబన్ధః తథా అనయో రప్యర్ధనారీశ్వరత్వేన భవిష్య తీతి సూచ్యతే.'

(10) ప్రకృత రఘువంశమంగళశ్లోకార్థమునకు ఉపబృంహకముగా మల్లినాథసూరి యుదాహరించిన వాయుపురాణ సంహితా వచనముయొక్క యర్థము నే విజయానందసూరి చరణసేవకుఁడు తన రఘువంశవ్యాఖ్యాదిలో

'శివా శబ్దమయీ ప్రోక్తా, శమ్భు శ్చార్థమయః స్మృతః,
అతః శబ్దార్థ నిష్పత్తి సిద్ధయే తౌ నతో మయా.'

అని యనువదించికొన్నాఁడు.

(11) సుమతివిజయ విజయగణి విజయానందసూరిచరణసేవకులు తమ రఘువంశవ్యాఖ్యలలో—"న న్వన్యేషు గణేశాది దేవేషు సత్సు ఉమామహేశ్వరయో ర్నమస్కారం కథం కృతవాం స్తత్రాహ.—

'ఈశ్వరాజ్ జ్ఞాన మన్విచ్ఛేత్ ముక్తి మిచ్ఛేజ్ జనార్దనాత్
ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే ద్ధనమిచ్ఛే ద్ధుతాశనాత్' ఇతి. "

అని యిట్లు వివరించియున్నారు.

(12) ఉక్త వాయుసంహితా వచనలోహము మహాకవి ప్రతిభానస్పర్శవేధి సోఁకినంతట సువర్ణీభూత మయిన వింతం బరికించిన యెడల, గ్రంథ మెల్ల నొక యెత్తును ఈశ్లోకమొక్కటియ యొకయెత్తునుంగా సహృదయులకు తోఁపకమానదు. సంహితా వచనమందు పార్వతీపరమేశ్వరులు శబ్దార్థ స్వరూపులుగా చెప్పఁబడియున్నారు; ఈశ్లోకమందు వానివలె కూడియున్నట్లు చెప్పఁబడియున్నారు. ఈయుపమ్యముచేత తత్తత్స్వరూపతామాత్రకథనమువలన తెలియనట్టిది పార్వతీపరమేశ్వరుల యొక్క నిరతిశయాన్యోన్య ప్రేమాతిశయము తెలియనగుచున్నది. ఉపమ లింగ వ్యత్యయ దూషితంబు గాకుండుటకై శబ్దశబ్దము వాక్చబ్దముగా మాఱినది.

సంహితావచనములో లేని జగత్పితృత్వముచే భక్తానుగ్రహమును కవీప్సితవిధియు సూచితము లయినవి. అన్యోన్యపిమనస్కులయిన తల్లిదండ్రులు పుత్త్రుని

మనోరథమును నెఱవేర్చుట సందిగ్ధమును అన్యోన్యానురక్తులు నెఱవేర్చుట యసందిగ్ధమును గావున మహాకవి అన్యోన్య నిరతిశయప్రేమ విశిష్టులనుగా స్మరించినాఁడు. ఇతని నాలుకయందు కాళికాదేవి వ్రాసిన బీజాక్షరద్వయము నా నొప్పు నీ యువాక్షరద్వయముచే, కవిలోక మెల్ల ఇతనియొక్కని సామ్మని యంగీకరించిన యుపమాలంకారము ఇందుం బొందు పడి యింత కవనోత్కర్షను దీని కొడఁగూర్చినది.

మఱియు నిది

> 'ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
> విన్దేమహి చ తాం వాచ మమృతా మాత్మనః కలామ్.'

అను నుత్తరరామచరిత నాంది రాకపోయినదా? భవభూతి 'విశిష్యతే' గదా.

## XI. కుమారసంభవము.

### "గృహీతపత్యుద్గమనీయవస్త్రా"

> సా మఙ్గళస్నానవిశుద్ధగాత్రీ । గృహీతపత్యుద్గమనీయవస్త్రా
> నిర్వృత్తపర్జన్యజలాభిషేకా । ప్రఫుల్లకాశా వసుధేవ రేజే.

ఇట పెండ్లిపీఁటమీఁద కూర్చుండఁబోవునప్పుడు పార్వతి ఏకదుకూలధారిణిగా నుండె నని యర్థ మగునట్లు మల్లినాథసూరిగారు టీక వ్రాసినారు. దుకూలయుగళధారిణిగా నుండవలయును. ఆవ్యాఖ్యలో ఎవ రేమి ప్రక్షేపించిరో! మూలము దుకూలయుగళమునే చెప్పుచున్నది. "తత్స్యా దుద్గమనీయం య ద్ధౌతయో ర్వస్త్రయో ర్యుగమ్" అని యమరము.

రజస్స్నానను స్నానమునను ఏకవస్త్రము. పెండ్లికొమారితకు రెండు తప్పవు:—

(1) దుశ్శాసనునితో ద్రౌపది సభాపర్వములో "నేను రజస్వలను ముట్టుకుండు మేకవస్త్రను" అని వచించుటం బరికింపుఁడు.

(2) ఈ క్రిందిది స్నానమందు ఏకవస్త్రత కుదాహరణము:— ఛా.

> "య దేకం పిచయాఞ్చలం నివసితం త త్స్నానకేళీస్థితా
> ఆనీ తేయ మద్భుతైకజననీ యోగీశ్వరే ణామునా."

(3) వివాహనేపథ్యమున దుకూలమునకు - బాలభారతకావ్యమున ఉత్తరావివాహనేపథ్యము—

> "సా చన్ద్రికాభం పరిధాయ వాస శ్చన్ద్రాననా ప్రాప విభావరీవ."

కుమారసంభవమున గౌరీవివాహనేపథ్యము—

> "క్షీరోదవేలేవ సఫేనపుఞ్జా । పర్యాప్తచన్ద్రేవ శరత్త్రియామా
> నవం నవక్షౌమనివాసినీ సా । భూయో బభౌ దర్పణ మాదధానా."

(4) వివాహ నేపథ్యమున వాసోయుగళమునకు—ద్రౌపదీస్వయంవర నేపథ్యము.
"కణ్ఠే మౌక్తిక దామ గణ్డతలయోః కార్పూర మచ్ఛం రజః,
సాన్ద్రం చన్దన మఙ్గకే, విచకిలస్రక్శేఖరం మూర్ధని,
తన్వీ గాఢ మియం చకాస్తి తనునీ చీనాంశుకే బిభ్రతీ,
శీతాంశో రధిదేవతేవ గళితా వ్యోమ్నో ద్రుతం గచ్ఛతః."

(5) "క్షౌమం కేనచి" త్తనుశ్లోకముపై వ్యాఖ్యలో రాఘవభట్టు — "మఙ్గళక ర్మణి సాధు మఙ్గల్యమ్ అనుపహతదళం గోరోచనాచిత్రితపర్యన్తం యుగళం చే త్యర్థః। అతఏవాగ్రే 'పరిధేహి సాంప్రతం క్షౌమయుగళ' మితి క్షౌమం దుకూలమ్" అని దుకూలయుగళమును నిర్ధారించినాఁడు.

(6) రావణుఁడు కొనిపోవుచున్నప్పుడు సీతాదేవికి ఉత్తరీయ ముండినది. ఆమె దానియందు తనతొడవులను మూటకట్టి ఆంజనేయాదులమోఁల వైచినది.

శకుంతల మగనింటికిం దరలునప్పుడు, శాకుంతలము చతుర్థాంకములో—

(7) సఖ్యౌ.—ప్రా. హలా శకున్తలే, అవసితమణ్డనాసి; పరిధత్స్వ సాంప్రతం క్షౌమయుగళమ్. [శకున్తలా నాట్యేన పరిధత్తే.

(8) సప్తమాంకమున విరహవ్రతను శకుంతలను రాజు ఇట్లు వర్ణించినాఁడు:—
"వసనే పరిధూసరే వసానా। నియమక్షామముఖీ ధృతైకవేణీ
అపి నిష్కరుణస్య శుద్ధశీలా। మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి."

(9) కాదంబరిలో—తారాపీడుఁడు తనపట్టపుదేవిని విలాసవతిం గాంచుట—
"గోరోచనాచిత్రితదళ మనుపహత మతిధవళం దుకూలయుగళం వసానామ్ విలాసవతీం దదర్శ"—పూ.

(10) అందే చంద్రాపీడుఁడు కాదంబరిం గాంచుట.—"జ్యోత్స్నాశుచినీ కల్ప ద్రుమ దుకూలే బిభ్రతీం... కాదమ్బరీ మపశ్యమ్"

(11) సాహిత్యదర్పణమందు— "ఏకస్యా మేవ నాయికాయా మాసక్తోఽనుకూల నాయకః। యథా—
అస్మాకం సఖి వాససీ న రుచిరే, గ్రైవేయకం నోజ్జ్వలం,
నో వక్రా గతి, రుద్ధతం న హసితం, నైవాస్తి కశ్చి న్మదః,
కి న్త్వన్యేఽపి జనా వదన్తి 'సుభగోఽప్యస్యాః ప్రియో నాన్యతో
దృష్టిం నిక్షిపతీ'తి, విశ్వ మియతా మన్యామహే దుఃస్థితమ్."

(12) సమయమాతృకయందు—వేశ్యామాత వేశ్యతో చెప్పుట.—

“ అద్యాపి మహామాత్యః । సత్యరథ స్త్వత్కృతే సమర్ఘదినే
ప్రహిణోతి వస్త్రయుగళం । న చ ప్రసాద స్త్వయాఽస్య కృతః.”

(13) పంచతంత్రములో హాలికభార్య ధూర్తునితో ఏఱు దాఁటి పాఱిపోఁజూచుట.

“ అథ తే నాభిహితమ్—‘భద్రే, పరిధానాచ్ఛాదనవస్త్ర మపి సమర్పయ, యేన జలమధ్యే నిశ్శఙ్కా వ్రజసి.’ తథానుష్ఠితే ధూర్తో వస్త్రయుగళం చాదాయ యథాచిన్తితవిషయం గతః.”

(14) కథాసరిత్సాగరములోని యీక్రింది సంవిధానముం గనుఁడు. లం. 14, త. 4.

“ఇతి తద్వచనా ద్యుష్మద్వార్తా జిజ్ఞాసయా స్థితే।
మయి తత్ర స్త్రియో దివ్యా నదీం తాం స్నాతు మాగమన్॥
సోఽథ మాం తాపసోఽవాదీద్ గచ్ఛాఽస్యా వస్త్ర మానయ।
ఆసు స్నాత్వా స్త్వమేకస్యా వార్తాం జ్ఞాస్య స్యతః ప్రభోః॥
త చ్ఛ్రుత్వాహం తథాఽకార్షం మా మన్వాగాచ్చ సా వధూః।
హృతవస్త్రాఽర్ధవసనా సహస్తస్వస్తికస్తనీ॥
నరవాహనదత్తస్య వార్తా మాఖ్యాయ వాససీ।
గృహాణే త్యుదితా తేన తాపసే నాథ సాఽబ్రవీత్॥”

## XII. విశ్వగుణాదర్శము.

### సమానరూపమ్

విశ్వావలోక స్పృహయా కదాచిత్ । విమాన మారుహ్య సమానరూపమ్
కృశానువిశ్వావసునామధేయం । గన్ధర్వయుగ్మం గగనే చచార. 5.

ఇది విశ్వగుణాదర్శములో వస్తునిర్దేశశ్లోకము. ఇందు “ సమానరూపమ్ ” అని ప్రాచీన పాఠము. ‘ సమానమయిన రూపముగలది ’ అని బహువ్రీహిగా “ సమానరూపమ్ ” అనురూపము సిద్ధింపదనియు, అట్టి బహువ్రీహి ‘ సరూపమ్ ’ అని యుండవలయు ననియు, శాబ్దికులు పోరాడం దొడంగుడు, నాఁటినుండి వ్యాఖ్యాతలు “ మానం చ రూపం చ మానరూపే - తాభ్యాం సహ వర్తతే ఇతి సమానరూపమ్ ” అని వివరించినవారును, తుదకు ఈబాధ యేల యని “ సమానవేషమ్ ” అని పాఠము మార్చినవారును, ఐరి. మఱి యిట కవిహృదయముం బడయుటకై “ అతిశయేన సమానమ్ సమానరూపమ్ - ప్రశంసాయాం రూపప్ ” అని వ్యాఖ్య చేయవలయు. అందువలన ఆగంధర్వు లిరువురును ఒకరికొకరు మిక్కిలి సదృశులని సిద్ధించును. ఒకఁడు ఏయుత్సాహములు, ఏయభిరుచులు, ఏవయస్సు, ఏ తెగువ, ఏ తెలివియుఁ గలవాఁడో, రెండవవాఁడు నట్టివాఁడే. అట్టివారగుట ఉద్దిష్టకార్యమునకు అనుకూలము, కావున దీనిని రూపబంతముగాఁ గొనుట మంచిది. కనుఁడు;—

“ జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ
పుత్త్రమేవంగుణోపేతం చక్రవర్తిన మాప్నుహి.” శాకుంత.

# ఆంధ్రమునుండియు నించుక

## I. పాండురంగమాహాత్త్యము.

### ౧. జ్వలనఁ జెలఁగు

క. స్మర శశి తటి దజ పవమా
న రవి సుధా సలిల మునిజనక్ష్మారిష్టా
సుర మృత్యు జ్జ్వలనఁ జెలఁగు
సురవేశ్యలఁ గొలిచి రంత సుబ్రహ్మణ్యున్. 1 (167)

టీక.— "స్మర...జ్వలనన్ = మన్మథుఁడు చంద్రుఁడు మెఱుపు ప్రకృతి వాయువు సూర్యుఁడు అమృతము జలము సప్తమహర్షులు భూమి శివుఁడు వీరియొక్క — ప్రకాశముచేత, చెలఁగు=అతిశయించునట్టి."

ఇందలియవకతవకలు స్వయంప్రకాశములు. మూలమున "జ్వలనజ లఁగు" అని పఠింపవలయును. "మునిజన" అనఁగా మునియనెడు జనము, అనఁగా మునియనెడు స్త్రీ. ఇందులతత్త్వము ఈక్రింది యుద్ధారముచే బోధపడును.

"యథా విబుధసద్మ న్యప్సరసో నామ కన్యకా స్స న్తీతి। తాసాం చతుర్దశ కులాని- 1. ఏకం భగవతః కమలయోనే ర్మనసః, 2. అన్య ద్వేదేభ్యః సంభూతమ్, 3. అన్య దగ్నే రుద్భూతమ్, 4. అన్య త్పవనా త్ప్రసూతమ్, 5. అన్య దమృతా న్మథ్యమానా దుత్థితమ్, 6. అన్య జ్జలా జ్జాతమ్, 7. అన్య దర్క-కిరణేభ్యో నిర్గతమ్, 8. అన్య త్సోమరశ్మిభ్యో నిపతితమ్, 9. అన్య ద్భూమే రుద్భూతమ్, 10. అన్య త్సౌదామనీభ్యః ప్రవృత్తమ్, 11. అన్య న్మృత్యునా నిర్మితమ్, 12. అపరం మకరకేతునా సముత్పాదితమ్, 13, 14. అన్య త్తు దక్షస్య ప్రజాపతే రతిప్రభూతానాం కన్యకానాం మధ్యే ద్వే సుతే ముని రరిష్టా చ బభూవతు। స్తాభ్యాం గన్ధర్వైః సహ కులద్వయం జాతమ్, ఏవ మేతా న్యేకత్ర చతుర్దశ కులాని." కాదంబరి.

స్మర...జ్వలన జలు= మన్మథ...వహ్నిసంజాతలు. పైకాదంబరీవాక్యములో "దేవేభ్యః" అనుటకు మాఱుగా "వేదేభ్యః" అని పడిన దని "సుర" అను పద్యపాఠమువలన నూహింపఁదగియున్నది.

## ౨. అవగుణములు

తే. తప్పు గల్గినచోటనే యొప్పు గల్గు;
నరసికావళికవితల యవగుణములు
సరసకవితావశోక్తులసరణియందు
నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె. 1 (14)

తే. కాన దోషాత్ము లైనదుష్కవులకతన
గరిమ నహియించుఁ గవిరాజకావ్యమహిమ,
బహుళపక్షంబుచీకటి బహుళ మగుటఁ
జాయవెన్నెల తరితీపు చేయుకరణి. 1 (15)

"అవగుణములు అమృతధారాప్రవాహంబు లడరు అని" యనన్వితము. "యవగుణములసరసఁ గవితా" అనిపఠించిన సరిపడును.

## 3. ప్రద్యోతననుత

క. శ్రీద్యుతిసువర్ణరేఖా
విద్యోతితసదననికష విద్వదనీక
ప్రద్యోతననుత గుణశత
వేద్యా రామానుజేంద్రవేదాద్రీశా. 4 (1)

ఇది మూలముద్రణము. ఇందులకు టీకాడంబరము—"ప్రద్యోతన=సూర్యుఁడా-విద్వాంసుల యొరయికచేత త్వష్టచేత సానఁబెట్టబడినసూర్యునివలెఁ బ్రకాశించువాఁడా."

దీనితత్త్వము నిట్లెఱుంగునది—శ్రీ...నికష=లక్ష్మియొక్క కాంతి యనెడు బంగారుగీట్లచేత వెలుంగఁజేయఁబడిన యిల్లనెడి యొరగల్లు గలవాఁడా, విద్వ... నుత = విద్వాంసుల సమూహమునకు సూర్యపుత్రుఁడా.— వేదాద్రిమంత్రియింట మహాలక్ష్మి నివసించియున్నదనియు, ఆయన పండితులకు కర్ణునివలె మహాదాత యనియు, నర్థము.—సువర్ణమను సువర్ణముం జేసికొన్నం బద్యము సువర్ణమువలె నన్వయించును.

## ౪. ముఖత నోలి

తే. అచమూరువు యూథంబుఁ ద్రోచి పఱచె
వింట న మ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుమ
లోల జిహ్వా కరాళ విశాల ముఖత
నోలి భీతేందుమృగశాబ మో యనంగ. 5 (15)

అని ముద్రణము. ఇటందత్త్వము—బోయ రాహువు, వానిచేతి యలుఁగుతోడి మండలీకృతచాపము లోలజిహ్వాకరాళ విశాలముఖము, వింటికొనలు పైకోఁటలుం గ్రిందికోఁటలును, వింటిబద్ద క్రిందికిని మీఁదికిని వ్యాపించి కలసియున్న కోఁటల కిరణములు, సంధీయమానబాణము లోలజిహ్వ, జౌజవ్వనుచున్న యల్లెత్రాడు సెలవుల తోడినోటియోరలు, చమూరువు (లేడి) చంద్రమృగము, యూథము (=కదుపు) చంద్రుఁడు.—పైయుత్ప్రేక్ష వాఙ్మయమున కెల్లనలంకారమయినట్టిది "మోవి"ని "నోరి"ని గావించినందున అపవసళశిమైనది. తమః=తమస్సనఁగా [అనఁగా రాహువనకు—"తమస్తు రాహుః స్వర్భానుః సైంహికేయో విధుంతుదః" అను.] భీత = భయపడిన - అని యర్థము.

## ౫. గ్రమ్మత్రిదశు

తే. వార్ధి నావర్తగర్తప్రవర్తులగుచు
నుదరరత్నాంశువులు గ్రమ్మత్రిదశు లమర
తరులు నఱకంగఁ దన్మూలతలము లమృత
సేకమున వెండి చిగిరించుచిగురు లనఁగ. 3 (149)

"రత్నాంశువులు గ్రమ్మఁ ద్రిదశు" అని దిద్దుకోవలయును.

## ౬. కనకక్రోలి

తే. సురలు కళ లెల్లఁ గ్రోలినసోముతనువు,
కప్పురము గ్రుమ్మరించినఁ గనకక్రోలి,
పువ్వుఁదేనియ చనిన యంభోరుహంబో,
యనఁగ మంచింకి బ్రహ్మాండ మగలెఁ జలిని. 4 (8)

"గ్రుమ్మరించిన గనపక్రోవి" అని దిద్దుకొనునది. గనప = పెద్ద-క్రోవి = బుడ్డి. భూమి ఆబుడ్డిలోనియడుగు, ఆకాశము దానికడుపు.

## ౭. బల్చాయల - అధరంబుల్.

మ. నలి నాసన్నలినాసనాననపురాణస్థానముల్ డాయ ని
మ్మల బల్చాయలబోరుతల్పు లధరంబుల్ కెంపువాచూరులుం
గల విద్వద్వదనాంతరాళనవరంగక్షోణి రాణించు న
జ్జ్వలవజ్రవ్రజశంఖసంఘనిభ భాషాయోష జిహ్వాస్థలిన్. 5 (266)

"డాయ కిమ్మలఁ బల్చాయల"-"లధరంపుంగెంపు" అని పఠించునది.

## పారిజాతాపహరణము

### నాణీయస్తన

శా. ఏణీశాబ విలోలనేత్ర కనుఁగొంటే వీరు విద్యాధరుల్
మాణిక్యోజ్జ్వల రత్నకుండలులు సన్మార్గైకచారుల్ రణ

ద్వీణాపాణులు చంద్రికామలశిరోవేష్టు ల్త్రిపుండ్రాంకితుల్
నాణీయ స్తనతారహారులు శివధ్యానైకనిష్ఠాపరుల్.

ఇందు "స్తనములు" అంతర్గడువుగా నున్నవి. ఈ స్తనములను బట్టి వర్ణ్యము స్త్రీ లందు మన్న కుండలలు వేష్టల్ పుండ్రాంకితల్ హారలు పరల్ అని యుండవలయును; మఱియు వారికి శిరోవేష్టము లుండవు. పురుషులే యేని వారికి స్తనములుండవు. ఈపాఠము 50 సంవత్సరములు ఇక్లే ముద్రణలయం దుండినది. ఇది ఎఫ్. ఏ. పరీక్షకు పాఠ్యమైన యొకవత్సరమున, 1881-2 సమీపమున, దీనికి మదరాసులోని మూఁడు కాలేజీలలోను అర్థము చెప్పక వదలివైచిరి. అప్పుడు నేను మదరాసులో నుండఁగా నామిత్రు లొకరు (ఇప్పుడు మదరాసులో ఇండియన్ బ్యాంకిలో క్లార్కుగానున్నట్టి శ్రీద్రోణంరాజు వేంకటకృష్ణరావుగారు క్రిష్టయన్ కాలేజి ఎఫ్. ఎ. విద్యార్థి) నన్ను దీని యర్థ మడుగఁగా, నేను "నాణీయస్తర" అని దిద్ది యర్థము చెప్పితిని. ఆచెప్పుచున్నక్షణమున అచటికి, పూర్వము నార్మల్ స్కూలులో నాకు ఆంధ్రవిద్యాగురువర్యు లయిన సుగృహీతనాములు, బహుజనపల్లి సీతారామాచార్యులు చెదలవాడ సీతారామశాస్త్రులు అను నిరువురలో రెండవవారు, వచ్చి సన్నిధాన మనుగ్రహించి, ప్రకృత మడిగి, నాచేసినసవరణను విని ఉపపత్తి వచింపు మనిరి.—"అణీయస్=కడుంజిన్నది. న+అణీయస్=కడుంబెద్దది-నాణీయస్తర=అంతకన్నం బెద్దది. విద్యాధరులు మేఘోద్భవములగు ముత్తెములను కుక్కుటాండ ప్రమాణములను నేల రాలక ముందే మింటనే హరింతు రని రత్నశాస్త్రము. కావున నిట మిక్కిలియుం బెద్ద యనునర్థము ఆవశ్యక మై యున్నది. అంత పెద్దవి కావుననే దూరమునుండి సత్యభామకు చూపుటకు శ్రీకృష్ణులవారికి అగపడినవి. న+అ-అని ఛేదముండుటంబట్టి ధ్యాలోని యాతో యతి చెల్లును."అని విన్నవించితిని. అంతట వారు- ఒకానొకయుపాధ్యాయుఁడు నాణెమయిన స్తనములమీఁది ముత్యాలహారములు కలవా రని యర్థము చెప్పె నని హాసించుచు వచించి, ఆయన్వయమునం గలిగిన యతిభంగము నైన ఆపండితుఁడు గ్రహింపమికి వింతపడిరి. మఱి నాయన్వయము నిట్లు కఠినముగాఁ బరీక్షించిరి. నీవు తరబర్థప్రత్యయముపై వెండియు తరప్ప్రత్యయము నెట్లు పెట్టితివి? అని యాక్షేపించిరి. "శ్రేష్ఠతమాయకర్మణే" అనువిధమున నని చెప్పికొంటిని. అది వైదికప్రయోగ మనిరి. వేదముననే కూడునుగాని లోకమునం గూడదని నియమము లేదని మనవి చేసితిని. అప్పుడు వారు ప్రెసిడెన్సీకాలేజిలో ఆంధ్రపండితులుగా నుండిరి. వారు తాము తమశిష్యులకు దానియర్థమును పిమ్మట చెప్పెద మని నిలుపుదలచేసి యున్నట్లు వక్కాణించి, 'నీసవరణప్రకారము నీయర్థమును నాశిష్యులకు ఇఁకను జెప్పెదను.' అని యానతిచ్చిరి.

తదనంతరము ఈప్రకారంపుఁ బ్రయోగములు నాకు వాఙ్మయమందు అప్పు డప్పుడు దొరకుచు వచ్చినవి.—

"జ్వలన్మహోమహీయస్తరమాయుధం దధత్." కుమారసంభవము 14 (6)

"భూయస్తరాణి య దమూని తమస్వినీషు." మురారి 2 (81)

"ఆకాశాధ్వని వంశకోటి ఘటితే తన్తౌ తనీయస్తరే." పంచబాణవిజయము.

"భూయస్తర ద్రవిణవితరణేన." పం. వి.

"మన్త్రి స్పృహలూనా మపి ధీసఖానాం శ్రేయస్తరా నైవ వదన్తి సన్తః."
హమ్మీరమహాకావ్యము 8 (99)

"శ్రేయస్తరం హన్త గుణాఽగుణానాం పరీక్షణమ్."

"శ్రేష్ఠతమా యాసన్న స్త్వాం ద్రష్టా" నలోదయము 1 (37)

"ఆస్థితాహీంద్రశయ్యా దవీయస్తరప్రస్థితాంఘ్రీ." ఆము. 3 (69)

ఈసవరణ క్రమముగా ప్రకటమై అనంతరముద్రణములలో పారిజాతాపహరణమున సంపాదకులచే ఆదృత మయినది.

## III. భారతము.

### ౧. గురుపద్యవిద్యకు

తరల. హరిహరాజగజాననార్కషడాస్యమాతృసరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతికిన్ నమస్కృతి సేసి దు
ర్భరతపోవిభవాధికున్ గురుపద్యవిద్యకు నాద్యు నం
బురుహగర్భనిభుం బ్రచేతసుపుత్త్రు భక్తిఁ దలంచుచున్. ఆది. 1 (22)

"గురుఁ బద్యవిద్యకు నాద్యు" అనిపఠించుట మెఱుఁగని మన్మతము.

### ౨. వివర్ధిత

మ. అమలోర్వీసురముఖ్యమంత్రహుతమాహాత్మ్యంబునన్ వాసవ
చ్యుతుఁడై ముందరఁ దక్షకుం డురువిషార్చుల్దూల వాత్యారయో
ద్ధతి నుద్ధూతవివర్ధితాయతబృహద్దావాగ్నిపోలెన్ విచే
ష్టితుఁడై మేఘపథంబునం దిరుగుచుండెన్ విస్మితుల్గా జనుల్. 2 (234)

వాత్యాశబ్దమున యప్రత్యయము సమూహార్థద్యోతనమందే వచ్చిన దైనను, ఆశబ్దమును సుడిగాలికి వాచకముగా పండితులు గ్రహింతురు.

"వాత్యాసంవేగ విష్వగ్వితత వలయిత స్ఫీత ధూమ్యాప్రకాశం
ప్రారమ్భేఽపి త్రియామా తరళయతి నిజం నీలిమానం వనేషు." మాలతీ 5(6)

"వాత్యానాం=మణ్డలాకారవాతానామ్" అని త్రిపురారిటీక.

"అభినవరాగరసోఽయం భవతోః కృతకౌతుకః పరిష్వఙ్గః
లవలీ లవఙ్గయోరివ నియతిమహావాత్యయా నిహతః." 10 (3)

"వాత్యయా=పవనమణ్డలేన" త్రిపురారి టీక.

"తీవ్రవేగధుతమార్గవృక్షయా
ప్రేతచీవరవసా స్వనోగ్రయా
అభ్యభావి భరతాగ్రజ స్తయా
వాత్య యేవ పితృకాననోత్థయా." రఘు. 11 (16)

టీకలో "వాత్యా వాతస్య మణ్డలీ. ఇతి హలాయుధః."

"ఉత్ఫుల్లస్థలనళినీవనా దముష్మా
దుద్ధూతః సరసిజసమ్భవః పరాగః
వాత్యాభిః ర్వియతి వివర్తితః సమన్తా
దాధత్తే కనకమయాతపత్రలక్ష్మీమ్." భారవి. 5 (39)

టీకలో "వర్తితః=పరిమణ్డలితః" మల్లి.

ఇందువలన 'వాత్య' యనఁగా సుడిగాలి యని విశదము. తదనుగుణముగా "వివర్ధిత" అనునది "వివర్తిత" [=సుడియింపఁబడిన] అని యుండవలయు నని తోఁచెడిని.

## శ్రీమదాంధ్ర భాగవతము, దశమస్కంధము, పూ. భా.

## సమర్పించిద్రొక్కిన

శా. ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగా రాని ని
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ యం
చాలాపాది సమస్తభావములు నీయందే సమర్పించి నీ
వ్రేలం ద్రొక్కినపాదరేణువులు పై వేష్టించినం జాలదే.

ఇది బ్రహ్మకృతశ్రీకృష్ణస్తుతిలోనిది. 1894 సం. వఱకు ముద్రణములలో నిట్లే యుండినది. పిమ్మట మాఱినదేమో? నామిత్రు లొకరు-"నాణీయస్తర" పాఠమునకు కారకు లైన యాద్రోణంరాజు వేంకటకృష్ణరావుగారే-కొన్ని వత్సరములకు మున్ను ఈపద్యమునకు నన్నర్థ మడుగఁగా నేను "సమర్పించు...నీవ్రేలం ద్రొక్కని పాదరేణువులు" అని సవరించితిని. వ్రేలందు=గొల్లలయందు. నాతో నప్పుడప్పుడు ఉబుసుపుచ్చు రసజ్ఞులకు ఈమార్పు "నాణీయస్తర"మువలెనే పలుమాఱు ప్రకట మైనది.

## IV. రాఘవపాండవీయము.

### ౧. జాతులఁద్రిదివ

సీ. పదునాల్గుజాతులఁ ద్రిదివకాంతల మీఱు పద్మినీజాతిసౌభాగ్యవతులు. 2 (11)

ఇది ముద్దరాజు పెదరామసుధీమణిపాఠము. ఇందుల నాతనిటీక:—"పదునాల్గు జాతులన్=బ్రహ్మ-క్షత్రి-వైశ్య-శూద్ర-వ్యావహారిక-గోరక్షక-శిల్పక-పంచాహాణ-కుంభకార-తంతువాయ-క్షౌరక-రజక-వస్త్రచ్ఛేదక-చర్మకర-తిలఘాతక-లుబ్ధక-చండాల-మాతంగు లనెడి. పదునెనిమిది జాతులందు బ్రాహ్మణజాతియు నరబాహ్యు లయిన లుబ్ధక చండాల మాతంగజాతులును వినా, కడమ పదునాలుగుజాతులయందును."—"జాతులఁద్రిదివ" అని పఠించి, పాం.రం.వి. 1 (138) వ పద్యంపుఁజర్చలో నుద్ధరించిన కాదంబరీ వాక్యమును ఇట అనుసంధించుకొనునది.

### ౨. మగధుల తన

తే. జగతిఁ గోసలకేకయ మగధుల తన
యలవరించిన యాజ్ఞలో మెలఁగఁజేసె. 1 (7)

ఇందులకు పెదరామసుధీమణి టీక:—"రా. మగధులయొక్క-తనయలన్-భా. కోసల కేకయ మగధులన్=ఈదేశముల రాజులను. తనయొక్క-అలవరించిన=నియమించిన." ఇట 'మగధులన్' అని ద్వితీయ యగునెడల 'మగధులఁ దనయల' అని పాఠ మేర్పడును. రామాయణార్థమునకు అది పనికిరాదు. "మగధుల = మగధులే... మెలఁగన్ = మెలఁగునట్లుగా" అని అన్వయించుకొన్న సరిపడును.

### 3. మహిమం గల

క. నెలకొనియె వేఁటతమి న
బ్బలియుఁడు శిశిరనగరుచిరపరిసరమహిమం
గల తమసతీరసికతా
విలసనములు డెందమునకు విం దొనరింపన్. 1 (17)

సుధీమణిటీక:—రా. మహిమంగల=మహిమను కలిగినట్టి-భా. మహియందు-మంగలతమ= అత్యంతశుభము లైన...ఇట నీవ్యాఖ్యాత రామాయణార్థమందు అనావశ్యకముగాను అశాస్త్రీయముగాను కలుగుధాతువును సకర్మకముగా అన్వయించినాఁడు. పరిసరమహిన్= సమీపప్రదేశమందు, మంగలతమస...=శుభమైన తమసానదియొక్క - అని రామాయణార్థమందును అన్వయింప వచ్చును.



PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS.